# కావ్యమంజరి

(ఖండకావ్య సంపుటి)



కర్త:

అభినవ శ్రీనాథ

జమ్మలమడక రామమూర్తి

# ఉపోద్ఘాతము

'కావ్యమంజరి' యను నీ గ్రంథము నాచే నప్పుడప్పుడు రచింపఁబడుచు వచ్చిన వివిధ శీర్షికల సంపుటీకరణమే. దీనిని నా సహధర్మచారిణికే యంకిత మొనర్చితిని. మా దాంపత్యాంకురము నిరాఘాటముగా, నిరుపమానముగా సుమారేఁబదియేండ్లు పెరిగి సత్సంతాన ఫల ప్రాప్తి నొసఁగి యాదర్శవంతమై నెగడినది. ఆమెయు స్వసంతాన విషయమున సమస్త కార్యలయములను నిర్వహించుటలో నాకుఁజేఁదోడు, వాఁదోడుగా నుండి తన గృహిణీత్వమును సార్థక వరుచుకొన్నది. ఇటీవల నాకస్మికముగా, ననూహ్యముగా నామె వరమువదించుటచే, సప్త సంతానములలోఁ బ్రశస్తతమమ్మెన కృతీశ్వరీత్వమును నామెకుఁ గలుగఁజేయుట కవిగా, భర్తగా నా కనీస ధర్మమని భావించి యిట్లు జేసితిని. దీనివలన నెంతకాలమామె నామము పాఠకజనుల హృదయములలో నిలచి యుండునో యంతకాలము నామెకు సురలోక సౌఖ్యాను భూతికిఁగొఱఁతయుండదని మన యుద్గ్రంథములు జెప్పుచున్నవి. అట్లైయైనచో నా సంకల్పము నెఱవేరి, నేను కృతకృత్యుఁడ నైనట్లే భావించు కొందును.

ఆమెను గూర్చి 'సతీస్మృతి' యను శీర్షికతో వివరింపఁబడి యుండుటచే నిట విస్తరింపను.

ఈ గ్రంథమును, దీనికి ముందే 'గురుగౌరవము' అను మరి యొక పద్య కావ్యమును (నేటి విద్యావిధానము–ఉపాధ్యాయుల స్థితి వివరించునట్టి కావ్యము) పకాలములో సక్రమముగా ముద్రించి యిచ్చిన 'దక్షిణ భారత హిందీ ప్రచార సభా ముద్రణాలయాధికారులకు, సిబ్బందికి నా హృదయ పూర్వక ధన్యవాదముల నర్పించుకొనుచు నీ యుపోద్ఘాతమును ముగించుచున్నాను.

హైదరాబాదు,
3-4-1980

జమ్మలమడక రామమూర్తి,
గ్రంథకర్త

# సతీస్మృతి

వేదాధ్యాపకుఁడైన తండ్రి సుకృతావాప్తిం గల్గి, శ్రౌతక్రియా
వైదుష్యమ్మున మించు పండిత జనుల్ వర్ణింప నాశీస్సులన్
'భావ' [1] స్వామి సమక్షమందు జరిగెన్ వైవాహిక ప్రక్రియల్
నీవున్ నేనును నేఁబదేశులుగ మన్నింపగ గార్హస్థ్యమున్.

ఉన్నదున్నయట్టు లుచ్చరించుటఁ జేసి
గట్టివాయి గృహిణిగాఁ దలంతు!
రంతెగాని లోతు నరయువారలకెల్ల
మలినమెఱుఁగ నట్టి మనసు నీది!

రాధికా కృష్ణుల రక్తిభక్తుల నెంచి
పెద్దవానికిఁ బేరు పెట్టినాను
కనిపెంచి విద్యనేర్పిన తండ్రి నామమ్ము
నెంచి రెండవవాని కుంచినాను
వేదపండితుఁడైన విప్రోత్తముని పేర
టుంచు మూడవ వాని కుంచినాను
భానుప్రసాద సంభవుఁ డంచు తన్నామ
మెంచి నాల్గవవాని కుంచినాను

---

1. భావన్ల పురమున వెంచేసి యున్న రాజ్యలక్ష్మీ సమేత శ్రీ భావనారాయణస్వామి.

అనఘ కళ్యాణి, లీలా, జయప్రదాంబ
హైమవతులయ్యె నిజకుమార్యాహ్వయములు
నామనిర్ణయ శాధ్యత కేమిగాని
సర్వ సందర్భములు భవత్సమ్మతములె!

ఒనరన్ శాశ్వతలబ్ధ కీర్తులుగఁ జేయున్ 'సప్త సంతాన' స
ద్ధనకార్యాచరణమ్ము: దానను ప్రశస్తంబౌ[2] కృతిప్రాప్తి, యం
చును భావించిరి పూర్వమందు కవిరాజుల్ రాజులుం గూడఁగా
వున నీకీ కృతి నంకితం బిడుదు సంపూర్ణానురాగమ్మునన్.

ఉన్నావో, నిత్యమ్మను
మన్ననఁ బూజించుకొన్న మహితాత్మ కడం!
జన్నావో, చేకొంటకు
నున్నతిఁ గాంక్షించి యుత్తమోత్తమభవమున్!!

ఆమూలమ్ముగ నీవియోగమున నా యర్ధాంగమే పోవఁగా
సామేనన్ సుఖదుఃఖ శేషముల నాస్వాదించుచున్, జీవిత
ప్రామాణ్యం బెఱుగంగరాని దగుటన్, బంధుప్రజానీక సం
క్షేమంబుల్ గనుగొంచు సత్వరమె కాంక్షింతున్ నినుం జేరఁగన్

మతమును, మానవత్వమును, మాన్యతనిచ్చు సుమంగళీత్వమున్
సుతులను, కూతులన్ విడచి, శుభ్రయశస్తనువున్ ధరించు నీ
కితరము నచ్చునే? యనుభవింపుము నీకయి కూర్చి నేడు స
మ్మతి నిడు నవ్యకావ్యసుమమంజరి భవ్యపరిమళమ్ములన్!

---

2. శ్రీ కృష్ణదేవరాయలు పెద్దన కవీంద్రునితో (మనుచరిత్రము)
"సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి, ఖిలముగాకుండునదిధాత్రి కృతియగాన, కృతి రచింపుము మాకు శిరీషకుసుమ, పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య!"

ధనమా లోపములేదు, ఖర్చిడిన నిందల్ సేయు వారెవ్వరుం
గనరా రాత్మజులందు, జాడ్య పరిపాకంబుల్ నివారించువై
ద్యనికాయమ్మునకే కొంతయునులే; దైశ్వర్య మిట్లుండియున్
నిను దక్కించు కొనంగఁజాల నయితిన్, నిర్భాగ్యుఁడం గావునన్!

భార్య యర్ధాంగి యనునట్టి పదములోని
యంతరార్థము నాకిప్పుడవగతమ్మె
బాగుగానయ్యె! నేఁబది వత్సరాల
యోగము వియోగముగ మార్పు నొందినంత!!

గడుపునిచ్చి కొంత కాలమ్మె జరిగిన
మరణమందు టొక్కమాడ్కి; నీవు
గడువు నీక కాల గర్భమ్మెఁ జేరితి
చింత నినుమడింపఁ జేసి నాకు!

పెద్దవారియందు బిడ్డలు సూపెడు
సత్ప్రవర్తనంబె శాశ్వతంబు;
చేరిపట్టి యాస్తి చిల్లిగవ్వయుఁగూడ
వెంటరాదు చావు వెంబడింప!

తులసిమాత మీఁది తోరంపు భక్తియు
నసువు లేఁగకుండ నడ్డలేదు!
భర్తకనులముందుఁ బసుపుకుంకుమలతో
స్వర్గసీమ కంపఁ జాలెఁ గాని!!

చాలగా నుందురిలను చుట్టాల సురభు
లైనవారలు; నీ వట్టులగుటె గాక
మంచివారైనచో స్నేహముంచి, వారు
మిత్ర సురభి యటంచాడ మెలఁగి నావు

వసుమతిఁ బుట్టువుం గనినవారికిఁ జావును దప్పదన్న వా
క్య సరణి పిన్న పెద్దలకు నందఱకున్ విశదంబ; యేదియో
పసియగుచావు గల్గునెడ సైరణ సేయఁగవచ్చు; కాని యీ
యసహజమైన నీ మృతికి నాత్మ తపించెడు వేయిభంగులన్.

పువ్వులతోడ నిన్నెప్డుఁ బూజ నొనర్చుట కంటె రాలతో
రువ్విన వాఁడనైతిని పరోక్షముగా నవసాన మెప్పుడో
దవ్వున నున్నదంచు నెడదం దలపోసితి! నాకు నిట్లుగా
నివ్వగఁ గూర్చి స్వర్గమునకేఁగెదవంచుఁ దలంప నుంతయున్!

ఆడు క్రౌంచమ్ముఁ జంపించి యబ్జభవుఁడు
కారకుండయ్యె శ్రీరామ కథకు నాడు!
నిండుగార్హస్థ్య భావమ్ము నెఱపు మమ్ము
వింగడించి యికేమి భావించినాడో!!

ఎందరు రాజులేఁగిరి, మఱెందరు వోయిరి చక్రవర్తులుం
గ్రందుగ వింతవస్తువుల గారడివాఁ డగుపింపఁజేసి, యా
నందముఁ గూర్చి చూపఱకు నాశమొనర్చెడు భంగి దైవ మీ
చందముగాఁగ నిన్ను నిజసన్నిధికిం గొనిపోవుటబ్రమే!

కొండకుఁగొండ దానికొక కొండ మఱొక్కనగంబు దానికిన్
దండగ నిల్చుకొన్న సురధామము చేరువ యౌనె? యంచు నా
కొండొకరీతి నూహలు సముద్ధతమై రోదసేయుఁ, గాని యీ
'డిండిమభట్టు' సాముగరిడీలటఁ జెల్లునె దైవసన్నిధిన్?

ధన్యప్రాపిత బాల్యకాల గతవృత్తాంతమ్ములన్ దాటి పైఁ
గన్యాత్వమ్మును బ్రహ్మచర్యముఁ జనన్, గార్హస్థ్య సౌఖ్యాంచితా
నన్యప్రాభవమున్ వెలార్చి, ఘనవానప్రస్థమం దుండియున్
సన్యాసమ్మును జూపినా, కరిగితే స్వర్గాను భూత్యర్థమై!

కొడుకులఁ గాంచి పెంచి, మనకుం గల హద్దును మీఱి, విద్యలన్
నడపితి, మెల్లవారును ఘనంబుగ జీవితడోలికన్ సుఖం
పడుచు, సుఖంబు నిచ్చుటకుఁ బాల్పడు నంతకు దాటిపోతి వె
య్యేడల నదొక్కటే నను దహించెడు దుర్విషయమ్ము నేడునున్।

సవిమర్శమ్ముగఁదావకీన విషయజ్ఞానంబు నా కుంటఁ, జ
క్షువులన్ మూసిన నీదురూపు కనవచ్చున్ స్వప్నలోకాన! నే
మవు నద్దాన? విషాద దైన్యములు పెంపై గాఢ చింతాను భా
వ వికారమ్ముల మానసం బెఱియు! దైవానుగ్రహం బెన్నడో!

'భాగవతుల' వారి భవనమ్ము లోపల
మాట లాడుకొనుచుఁ బాటఁబాడు
కొనుచు నుంటివంచు నినుఁజేరవత్తునా।
అందరాని చోటి కరిగి తీవు।

వయసు మీఱియు, సంసారశతఁజేసి
బరువు మోయుదు నంచని బాధపడితి।
మిన్నుపైఁబడ్డనిఁకమీఁద నన్నుఁగూర్చి
యీగతిఁ బరామృశించు వారెవ్వరింక?

ఎవని నామమ్ము పాతక నివహవాచ్య।
మెంత కంతకు స్వర్గాననే యతండు
శక్తితో వెల్గునన్న యార్యోక్తి గలదు
కావునఁ గృతీశ్వరుల కింకఁ జావులేదు!

పసిగా జీవిత మంతయున్ ధరణిపై సాగించుకోఁగల్గు మా
నిను లెవ్వారును లేరు లోకమున; మాణిక్యంబులం బోలి యు
ల్లసముం గూర్చెడు బిడ్డలుం బతియు నిల్వన్ వారి హస్తాలలోఁ
బసుపుం, గుంకుమ పూలతోఁ జనిన నీ భాగ్యంబు సామాన్యమే।

# కృతీశ్వరి



కృతికర్త శ్రీ జమ్మలమడక రామమూర్తిగారి
ధర్మపత్ని కీ॥ శే॥ సీతారామమ్మగారు

జననము : క్రీ. శ. 1915

మరణము : 18, జులై, 1979

# కావ్యమంజరి శీర్షికలు

# విశ్వనాథ నాయకుఁడు

ఉద్యత్తేజోవిభవ
ప్రద్యోతన కృష్ణరాయ పరిపాలితమై
విద్యారణ్యస్థాపిత
విద్యానగరమ్ము సర్వవిధముల వెలసెన్. 1

అనతవైరివీరనిచయార్చిత దివ్యమణీమయూఖ సో
పానములన్ గమించి, నరపాల నిసర్గ కటాక్ష మాలికా
యానము సాగి, పాలిత జనాభ్యుదయమ్ము ఘటింప, నాడు వి
ద్యానగర ప్రభుత్వమునఁ దాండవమాడె సుభిక్ష మెల్లెడన్! 2

శౌర్య మౌదార్య ముప్పొంగు సార్వభౌమ
విజయ గాథల 'నష్టదిగ్గజము' తెలిమి
వీర శృంగారముల మేళవించి పలుక
"భువన విజయమ్ము" మార్మ్రోగిపోయె నాడు! 3

ఆ రాజమౌళి కన్వయ
పారంపర్యానుగతుఁడు, బహువిధ విద్యా
పారగుఁడు, సచివశేఖరుఁ
డై రాజిలెఁ దిమ్మనార్యుఁ డప్పాజి యనన్. 4

రాచరికంపుటుజ్జ్వలపరాక్రమ వైభవమే నిమిత్తమో,
ధీ చతురత్వ కారణమొ! దేశము నల్గడలందు రాజ్య ల
క్ష్మి చరణాంబుజ ద్వయము చేరువఁ బ్రాణము లొడ్డనైన సం
కోచము నందు 'వేరుపురుగుల్' గనరావఁట నాటి యేల్బడిన్! 5

శ్రీ విజయనగరరాజ్యర
మావిలసితమైన కోశమందిరమున స
ద్భావుఁడు నాగమ నాయక
ధీవరుఁ డధ్యక్షతా ప్రతిష్ఠితుఁ డయ్యెన్. 6

భోగ భాగ్యాలతోఁ దులఁదూగుచున్న
నరపతికిఁ బ్రీతిపాత్రుఁడై పరగుచున్నఁ
బుత్రసంతతి లేదన్న భూరిచింతఁ
బాయలేఁడయ్యె నాగమనాయకుండు! 7

ఒకనాఁ డాప్త పురోహిత
సకల సుహృన్నిచయబంధుసంవృతుఁడై నా
యకవంశతిలక మీ గతిఁ
బ్రకటించె మనోవిచారభర మెల్లరకున్. 8

"మానవ లోకమందుఁ గొఱమాలిన జీవితమన్నఁ బుత్ర సం
తానము లేని వానిదె గదా! సుతహీనుఁడు భోగియయ్యు నె
మ్మేనుఁ దొఱంగుపై నరకమే! పరలోకసుఖమ్మొసంగఁగా
లేని సిరుల్ పరశ్శతములే యగుఁ గాక ఫలమ్ము గల్గునే? 9

నోములు, సద్వ్రతంబులు మనోరథసిద్ధి ఘటింప వాయె, నిం
కేమి యొనర్చువాడ? హితమెయ్యదియో వివరింపుఁడ"న్నఁ ద
త్కామితమున్ గ్రహించిన సదస్సులు వల్కిరి, "పోయిరమ్ము నీ
తామరసాక్షితో నఘలతానిశితాసికి వారణాసికిన్. 10

కలఁ డచ్చోట భవాదృశాత్రజన రక్షా దక్షుఁడౌ పార్వతీ
లలనాధీశుఁడు; గాంగ నిర్మల జలాప్లావ ప్రపూతాత్ములై
ఫలకాంక్షన్ స్మరియించినంత నెదుటం బ్రత్యక్షమై నిల్చి కో
ర్కెల నీడేర్చు నతండు భక్తతతి కుర్విన్ నాయకోత్తంసమా! 11

అని వారల్ వచియింప సమ్మతిలి రాజాజ్ఞన్ ధనాగార భా
రనియుక్తిన్ విడనాడి తత్క్షణమ భార్యాయుక్తుఁడై ధారుణీ
జనముల్ మోద విచార సంభ్రమ సముత్సాహాంబు లుప్పొంగ దీ
వన లీయం జనె నాయకుండు తన క్రోవం బుత్తలాభార్థియై. 12

తాల తక్కోలహింతాల సాలరసాల
　　కింశుకా ద్యవనిజాకీర్ణ పథము
లభ్రచుంబిత పాదపారూఢ శుకపిక
　　శారికా కలరవ స్థావరములు
దావపావక శిఖాంత స్సంచర న్మారు
　　తాశనాఖిల ప్రదేశతతులు
ఖడ్గపంచాననోగ్ర వ్యాఘ్రభల్లూక
　　భయద మహాటవీ ప్రాంగణములు

గడచి, దంపతు లుగ్రంపుఁ గాననముల
సంభవించు విపత్తుల సరకుఁ గొనక
భార మల పార్వతీనాథు పైన వైచి
చేరి రెట్టులో వారాణసీ పురమ్ము! 13

నియమితాహార పానీయ వాంఛాపరి
　　తుష్ణ మానసులౌచుఁ గొన్నినాళ్ళు
భాగీరథీ తీర పరిసరాగత భక్త
　　కోటి నర్చించుచుఁ గొన్నినాళ్లు
చిత్కళా మూర్తియై చెలఁగు విశ్వేశునిఁ
　　గోరి భజించుచుఁ గొన్నినాళ్లు
జపహోమ దానాది సర్వవైదిక కర్మ
　　సన్నాహముల చేతఁ గొన్నినాళ్లు

భౌతికసుఖాతినీచలంపటత వీడి
ఘోర వైరాగ్య వృత్తిచేఁ గొన్నినాళ్లు
గడువ నాగమ నాయకాగ్రణికి నొక్క
రాత్రిఁ గలలోన విశ్వేశ్వర ప్రభుండు. 14

ప్రవిమల గాంగ నిర్ఝర విభాసిత కేశకలాపమున్, జగ
ద్భవన విదాహ తీక్ష్ణతమ పావక నేత్రము, వైరి మారణో
త్సవ నిశితత్రిశూలము, భుజంగమభూషితదేహ మొప్పఁగా
సవిధమునందుఁ గన్పడె నిశా సమయమ్మున నాగమయ్యకున్. 15

అంతన్ నాయకుఁడా గిరీశునకు సాష్టాంగప్రణామంబు ల
త్యంత ప్రీతి నొనర్చి, మానస మహోద్యానస్థితానేక వా
క్సంతాన ప్రసవాత్మకమ్ములగు పూజల్ జేసి, భక్త్యున్నతిం
జెంతన్ నిల్చిన సంతసించి యిటు విశ్వేశుండు పల్కెం గృపన్. 16

"మెచ్చితి నీదు భక్తికిఁక మీఁదట నిష్ఠలతోడఁ గాలముం
బుచ్చక, ధర్మపత్నిఁ గొనిపోయి, స్వకీయ విధుల్ వహించి, నీ
యిచ్చ తెలుంగునన్ మసలు; మింక నెలల్ పది పోయినంత న
భ్యుచ్చయ జీవనుం డొక సుపుత్రుఁడు నీ కుదయించు మత్కృపన్! 17

ఆ మహనీయ వాక్యవిభవాతిశయామృతవార్ధిఁ దేలి, యొం
డేమియుఁ బల్క నోపక, కుదించిన జంత్రపు బొమ్మకై వడిన్
మోమును వంచి, కన్ను లరమోడ్చి, వినమ్ర శరీరుఁడయ్యె, నా
స్వామి యదృశ్యుఁడై చనిన చందము దోప ననంతరమ్మునన్. 18

అమితోత్సాహ తరంగితాత్ముఁడయి, భార్యారత్నముం జేరి, య
య్యమకున్ శంభువరప్రసాదమహనీయాపూర్వ స్వప్న ప్రభా
వము వాక్రుచ్చిన సంతసించె, గిరిజా భర్తం బ్రశంసించి రు
త్తమ వాగ్వైఖరిఁ గొంత సేపరువు రత్యంత ప్రమోదాత్ములై! 19

మరునా డతండు కాశీ
పురజనులకు వీడ్కొలిపి, భూతేశ పదాం
బురుహద్వయ చిహ్నమ్ముల
శిరమునఁ గీలించి, భక్తిచే మ్రొక్కెచెన్! 20

ఇట్లు కొన్ని దినములేఁగఁ గాశిక వీడి
కతిపయప్రయాణతతి నెసంగ
విజయ నగరమునకు వేంచేసి రిర్వురుఁ
బూర్వ పదవిఁ జేరిపోయె నతఁడు. 21

నవమాసమ్ములు నిండఁ బుత్రకుఁడు జన్మంబందె, సంస్థాన గౌ
రవమున్ నిల్చెను; విశ్వనాథుఁడను పేరం బెద్దయై, [1]కృష్ణ పా
ర్థివు మెప్పింపఁగఁ దండ్రితోఁ బెనఁగి బంధించెన్ సజీవమ్ముగా
నవునౌ! రాచరికంపు టూడిగమునం దా రీతులే ధర్మముల్! 22

---

1. నాగమ నాయకుడు కోశాధిపతియే గాక, యపత్రక విక్ర మోపేతుఁడగు సేనాధిపతియును. కృష్ణరాయని సామ్రాజ్యము దాదాపు దక్షిణాపథమంతయు వ్యాపించి యుండుటచే, నెల్లరును సామంతులై కప్పములు గట్టుచుండిరి. ఒకప్పుడు పాండ్య, చోళరాజుల యక్రమ ప్రవర్తనము కారణముగా, వారల నణఁచి కప్పములు గొనితేరఁగృష్ణ రాయలు నాగమ నాయకుని నియమించెను. అతఁడును రాజాజ్ఞ ననుసరించి కావలసిన సైన్యము వెంటఁగొని యాదేశములను జయించి, రాజులనుండి కప్పములు గొనెను. అప్పుడాతని కొక దురూహ జనించి, పాండ్య, చోళరాజ్యములకుఁ దానే ప్రభువుఁగాఁ బ్రకటించుకొని యేలఁ జొచ్చెను! కొంత కాలమున కీతిరుగుఁ బాటును గూర్చి రాయలవారికిఁ దెలియవచ్చెను. అతఁడాగ్రహోదగ్రుఁడై నిండు సభాముఖమ్మున జరిగిన వృత్తాంతముఁ జెప్పి, "వెంటనే దక్షిణా పథమునకు వెళ్ళి, నాగమ నాయకు నోడించి, సజీవముగా బంధించి తేవలయును. ఇట్టి ఘనిఁ జేయఁగల వారెవ్వరైన నీ సభలోఁగల సేనానులలోఁ గలరా"యని

మహావేశమునో బ్రశ్నించెను. సభలోని యెల్లరును నిరుత్తరులైరి! నాగమ నాయకుఁడన్ననంతటి పరాక్రమశాలి! ఎవ్వఁడాతని నెదిరించి జయింపఁగలఁడు? అంతటను మౌనము! కొంతసేపటి కొక యువక సేనాని లేచి నిలఁబడి, "మహారాజా! మీ యాజ్ఞయైనచో నే నా కార్యమును నిర్వహించి నాగమ నాయకునిఁ దమ పాదముల కడ నుంచఁగలను! సెలవిండు!" అని పలుక సభ యంతయు నివ్వెఱవోయెను! రాయలానంద పరవశుఁడై యాతని రాజ భక్తికి మెచ్చి యంగీకరించెను అతఁడును ససైన్యుఁడై పోయి తన మాటను నెగ్గించు కొనెను। ఎవరీ యువక సేనాని? ఎవరో కాదు. నాగమ నాయకుని యేకైక పుత్రుఁడగు విశ్వనాధ నాయకుఁడు !!

# పన్నా రాజభక్తి

ఆర్యావర్తమునం గనంగ నగు. దివ్యామూల్య జాంబూనదా
హార్యోత్తుంగ సమంచి తాయతన హర్మ్యవ్రాత నానావిధై
శ్వర్యోన్నత్య తృణీకృతామరనివాసంబుల్, మహావీరరా
ష్ట్రార్యో దంచిత సత్కథా కలిత "రాజస్థాన" సంస్థానముల్! 1

పాలనాదక్షులైన రాణాలకెల్ల
రాజధానిగ నుదయపురం బెసంగ
నా డధిష్ఠించె నందు మేవాడ రాజ్య
సింహపీఠిక సంగ్రామసింహుఁడెలమి. 2

'సంగరాణా' యటంచాత్మజనము పిలువ
వీర సంగ్రామ సింహుండు వెలయుఁ, గాని
మంత్రి 'వనవీరుఁ' డొక కొంత తంత్రవాద
కలుషితుం, డధికార కాంక్షా పరుండు! 3

ఉన్నారు రాణివాసపుఁ
గన్నులలో మెలఁగు నూడిగపుఁజెలిక త్తెల్,
మన్ననకుఁ బాత్రమైనది
'పన్నా' యొక్కర్తు సకల పరిచారికలన్. 4

ఉజ్వలాకారుఁడై యొప్పు నుదయసింహుఁ
డేక పుత్రుఁడు సంగరాణాకుఁగల్గి
నేకపుత్రుఁడు గల్గెఁ బన్నాకుఁ గూడ
బదిదినా లించుమించుగ భగవదిచ్ఛ! 5

తనయుల నిర్వైరన్ బహువిధంబులఁ గంటిని ఱెప్పవోలెఁ ద
జ్జనములు రక్షసేయఁగొన సాగె సుఖమ్మొక నాలుగేండ్లు, దు
ర్దినములు వచ్చె; శాత్రవుల తీవ్రత హెచ్చె; నృపుండు వారితో
ఘనముగఁ బోరి దేశమునకై కడకున్ బలియయ్యె దుర్విధిన్! 6

సంగరాణా మరణవార్త సాధ్వియైన
తత్సతీరత్న మాలించి, తక్షణంబు
రాకుమారుని దాసి పన్నాకొసంగి
క్షత్రియాంగన గావున సహగమించె! 7

వాడి మగఁటిమితోడ మేవాడ సైన్య
మొక్కమారు విజృంభించి యోర్చె రిపుల!
రాజపుత్రుని పేర సర్వమ్ము మంత్రి
కరగతమ్మయ్యె; నిటుకొంతకాల మరుగ, 8

కాఱుచీకటిఁ దారాడు గబ్బిలంబు
పగిది, వనవీరఘోరపాపప్రపూర్ణ
దుష్టమస్తిష్కమునఁ దొంగి త్రొంగి చూచె
స్వాహా కందని రాజవిద్రోహ చింత! 9

"సకల మేవాడ రాజ్యలక్ష్మికి విభుండ
నగుదు నన్నట్టి వారి జోస్యము ఫలించె!
నంతిపురి నున్న పసిబిడ్డ నస్మదీయ
ఖడ్గధారకు బలియిత్తుఁ గాక నేఁడె!" 10

వనవీరుని మంత్రాంగము
కనుమఱుఁగున నుండఁ దెలియఁగాఁబడె నంబ
ష్టుని కొక్కనికి; కాతఁడు చ
య్యనఁ బన్నాచెవిని వేసె నతిదైన్యమునన్! 11

పొంగివచ్చు విషాదమ్ముఁ బుక్కిలించి,
మనసు బిగియించి, కర్తవ్యమును స్మరించి,
"రాకుమారుని రక్షింప నాకుమారు
నర్పణము సేతు మేవాడ" కని తలంచె! 12

లేత గులాబి చెక్కిళుల లేనగవుల్ ప్రసరింప, గుండెలో
భీతి యొకింతయేనిఁ గనుపింపని నిష్కలుషత్వ మానన
ద్యోతముగాగ, నిద్రఁగనుచున్న యభాగ్యుని రాజవంశ పం
జాతుని గంపలోన నిడి చయ్యన మంగలి కిచ్చి 'పొ' మ్మనెన్! 13

మాతృవాత్సల్యమును గూడ మంటఁగలిపి
తెగువ వేరొండు చోట నిద్రించుచున్న
సమ వయస్కుని నిజ తనూజాతుఁ దెచ్చి
యుదయ సింహుని శయ్యపై నుంచె దాసి! 14

అంతట నేతెంచె నిశా
భ్యంతరమున ఖడ్గహస్తుఁడై వనవీరుం
డంతకుఁడు వోలెఁ, బన్నా
స్వాంతము జల్లుమన రాజసౌధము కడకున్! 15

పడకటిల్లుఁ జేరి పన్నాను గద్దించి,
గెంటివైచి, సెజ్జ నొంటి నున్న
చిన్నికుఱ్ఱఁడుదయ సింహుఁడే యనుకొని
తలను నఱకి వేగఁ దరలిపోయెః 16

కన్నబిడ్డ కఱకుఁగత్తికి బలిగాఁగ
గుండెఱాయిఁ జేసికొన్న దాసి
యంతిపురము వీడి యంబట్టు కడనున్న
రాకుమారు వేగిరముగఁ జేరి! 17

మంగలి రాజభక్తికి నమస్సులొనర్చి, రహస్యవైఖరీ
భంగమొనర్పఁబోకు మని పల్కుచు, రాజసుతద్వితీయయై
చెంగున దాటిపోయెఁ బెను చీకటిలో నెటకో! సమీప వృ
క్షాంగన లెల్ల సాంద్ర తుహినాశ్రు కణంబులు రాల్చుచుండఁగన్! 18

గర్భశోకంబు దిగఁద్రావి కాననములఁ
గొండకోనలఁ బన్నానిగూఢ వృత్తి
రాకుమారిఁ బెంప, లోకైక వీరుఁ
డతఁడు వెండియు మేవాడ కధిపుఁ డయ్యె! 19

# మహామంత్రి తిమ్మరుసు

ఎందున్ నీ కనుజుం డనం దగిన వాఁడే సుమ్ము తమ్ముండు గో
విందామాత్యుఁడు, వైరిమర్మముల నన్వేషించి ఛేదించుచోఁ;
హిందూరాజ్య రమా శుభాశిషము మీకే దక్కెఁ; లేకుండినన్
బందీలై పరధర్మ తత్పరత మా ప్రాచీను లల్లాడరే! 1

తలి దండ్రుల్ గతియింప బాల్యమునఁ గాంతారంబునం దొంటిగా
నిలువన్ నేరక, చెట్టునీడ నొకచో నిద్రింప, సూర్యాతపం
బెలమిన్ సర్పవిభుం డెదుర్కొనిన నాడే పల్లవించెన్ మహో
జ్జ్వలతాప్రాభవవై భవోన్నతభవిష్య జ్జీవితాశాలతల్! 2

పోటరులైన శాత్రవుల పొంగునఁ గ్రుంగి తపించుచున్న క
ర్ణాట వసుంధరాసతి మనం బల సాళువ నారసింహుపై
నాటఁగఁజేసి, స్వప్రజ కనంత శుభోదయమున్ ఘటించు నా
రాటము తోడఁ గార్య చతుర్వ్రతముఁ జూపవె? తిమ్మధీమణీ! 3

ప్రత్యూషమునఁ గాల కృత్యంబు లొనరించి,
ముదముతోడ 'సువర్ణముఖి' మునింగి,
స్నాన సంధ్యాద్యనుష్ఠానంబులం దీర్చి,
కావ్య శాస్త్రములు చక్కఁగఁ బఠించి,
మాధుకరానీత మహితాన్నము భుజించి,
గంటాలతోఁ గొంత కదను ద్రొక్కి,
ఆంధ్రసాహిత్యంబు నవలోకనముఁ జేసి,
యావల రాజకీయము లెఱింగి,

చల్లవేళల వాహ్యాళి సలిపి, రేలఁ
బూర్వరాజన్య చరితముల్ పుక్కిలించి,
యాత్మ విశ్వాస బలమున నఖిల విద్య
లభ్యసించిన నిన్నెవ్వ రడ్డఁగలరు? 4

శ్రీ నాదెళ్ళకులీనుల
మేనల్లుఁడవై, యఖండ మేధాబలవి
జ్ఞానైకదీక్షచే నెం
తైనాఁడవు! తిమ్మయా! స్వయం కృషి వల్లన్. 5

శాల్యకష్టములను బరికించు 'పెనుగొండ'
'గుత్తి' 'చంద్రగిరు'లు గొణుఁగుఁగాక
నీదువై భవమ్ము నిఖిల దిక్కులఁ జాటు
'విజయనగర' మొకటె వేయినోళ్ళ! 6

ఇట్టి మహాగుణాన్వితుఁడ విద్ధచరిత్రుఁడవే నిమిత్తమో
[1]బట్టుకవీంద్రు కోపహతి పాలయినావు! విచిత్ర మింతలోఁ
దిట్టు కవిత్వ మొక్కపరి దీవనయయ్యె! జగానఁ జాటినా
వెట్టి మహాత్ముఁడైనఁ గవి కించుక లోఁకువె యన్న సత్యమున్. 7

విజయోత్సాహము పొంగి, శాత్రవుల దోర్వీర్యంబు లెక్కింపకే
గజయూథాధిపుఁడా కళింగ పతిపైఁగాల్దువ్వ భూజాని, క
క్కజముం గూర్చెదు భేదతంత్ర మెసగంగాఁ శాత్రసామంతులన్
[2]'నజరానా' ల నొసంగి లోఁగొని శుభాంత ఖ్యాతిఁ జేకూర్పవే! 8

---

1 బట్టుకవి — రామరాజ భూషణబిరుదాంకితుఁడైన 'వసుచరిత్ర' ప్రబంధ కర్త.

2. నజరానాలు — బహుమతులుగా నిచ్చు వస్తు, ధనరూపము లగు కానుకలు.

ఆకౌమార్యముఁ గృష్ణరాయనికి విద్యాబుద్ధులన్ నేర్పి, త
ల్లోకజ్ఞత్వ కళానుభూతి కొక వెల్గుం గూర్పఁగా ధర్మ ని
ష్ఠాకౌశల్య మెలర్ప 'బిడ్డకుఁ' జపేటం బిచ్చి వెన్వెంటనే
శోకింపన్ దొరకొన్న నీకివె నమస్సుల్ భూసురగ్రామణీ! 9

మూఁడు తరాలుగాఁ గనుల ముందట వెల్గుచు, రాజ్యలక్ష్మికిం
గీడుఁదలంచు దుర్మతులఁ గీటడగించుచుఁ బ్రాణమిచ్చి కా
పాడిన నీకు రాయలొకపట్టునఁ జేయు మహోపకార దు
ష్పీడ- చరిత్ర కల్పితమొః ధిషణ సత్యమొ! తిమ్మయాగ్రణీ! 10

ప్రేవుల్ త్రావులు దప్పు నొక్కపరి హంపీక్షేత్రశైథిల్య ప్రా
గ్భావావేశము నొందు హైందవులకుం, బ్రాచీన భాస్వత్కళా
ప్రావీణ్యమ్మొలికించు నిచ్చటి యనల్ప భ్రష్ట శిల్పాలలో
మా విద్యానగర ప్రశస్తిఁ బరికింపన్ రారె వైదేశికుల్! 11

మహిత హైందవ నవ్య సామ్రాజ్య శౌర్య
లోక బాంధవ దీప్తులలోఁ గలంగి
భామినీ రాజ్యముల నేలు పాదుపాల
గలువతన మెల్ల మెల్లఁగా విరిసిపోయెః 12

ఉత్తర భారతమ్మును మహోద్ధతి నూపిన నాటి యావనో
న్మత్తపిశాచి కిచ్చినది మార్గము వింధ్యనగమ్ము సైతః ము
వ్వేత్తుగ దక్షిణా పథమునే కబళించెడినేమొ యన్న మా
యుత్తలపాటు మాన్చితి వహో! కుదుటంబడె మాదు గుండియల్ 13

# రాణాప్రతాప్

ఏఁడీ నీ సరి వీర శేఖరుఁ డొకం డీ భారతక్షోణి? నే
నాడో దిక్కులఁ బిక్కటిల్లిన భవన్నామాక్షర ధ్వానముల్
నేడీ భారతజాతి రక్తమున జీర్ణించెన్, యశోరాశి! మే
వాడాధీశ్వర! నీ ప్రవృత్తికి నమోవాకంబు లర్పించెదన్. 1

చెదరి కొండలతోడఁ జెడుగుడుల్ గూయు పూ
నికఁ గల్గు భిల్లసైనికదళంబు!
పగవారిచేఁ బట్టుబడు టెఱుంగని లీల
రాణించు పంచకళ్యాణి హయము!
గర్వాన దాని 'అగ్బరు పాదుషా' కంట
దుమ్ముఁ గొట్టు రహస్యదుర్గవితతి!
లోకత్రయంబు భస్మీకరింపఁగఁ జాలు
[1]'పాచేశ్వరి' సతీత్వ ప్రభావ!
మండయై యుండ, మాతృదేశాభిమాన
సురుచిరజ్యోతి మార్గంబుఁ జూపుచుండ
మహిత సుస్థిర యవనసామ్రాజ్యసౌధ
మూపి వైచితి గాదె నీ వొక్కనాఁడు!! 2

కదన పిపాసమైఁ దురక కాల్బలముల్ నిను వెంబడింపఁగాఁ
జెదరిన గుండెతోఁ గడుపుఁ జిచ్చు గణింపక పర్వులెత్తు నో
యుదయ పురాధినాథ! యెటు లూపిరి నిల్పితి వయ్యొ![2] అంబికా
వదన సరోరుహంబు వసివాడి కృశించుట నీ వెఱుంగవే? 3

1. రాణాప్రతాపుని సతీమణి.
2. రాణాప్రతాపుని పసిబిడ్డ.

యోషా రత్నము, రాజ్యభోగ చిరసౌఖ్యోల్లాససంప్రీత, శై
రీషానూనతనూవిలాసిని, మహార్తిన్ గ్రమ్మగుచున్ వెంటరా
నీవత్తేని మనోవికారముఁ బ్రదర్శింపంగఁ బోవంట! యే
పాషాణాత్మకుఁడైన నోర్వఁగలఁడే పాశేశ్వరీ దుఃఖముల్? 4

ఒకనాఁడు పర్వతాంతిక సీమ లెగఁబ్రాకు
కఠినత్వమున కోడిఁగట్టినావు!
ఒకనాఁడు తృణధాన్య శకల నిర్మితమైన
వాడుటొట్టెకు లోట్ట వైచినావు!
ఒకనాఁడు నోటిలోనికి జారు కబళంబుఁ
దినమాని పరుగులు దీసినావు!
ఒకనాఁడు వివిధాటవిక కుటీరములలోఁ
దలఁదూర్చి గండాలు దాటినావు!

బాహ్యదృష్టి విసర్జించి, పరమయోగి
కరణి రాజ్య సుఖైకతత్పరత తోడి
పారతంత్ర్యంబు రోసి కాంతారమునను
స్వైరవీర విహారమ్ము సలిపినావు!! 5

"ఆలోచింపుము, సేతు శీతనగ మధ్యక్ష్మాతలం బెల్లనీ
పాలం జిక్కిననైన నా జనని మేవాడన్ వినిర్జించి నీ
వేలం జాలని యంత దాఁక మొగలాయీ సార్వభౌమత్వ మే
లీలం జెల్లు?" నటంచు నగ్బరున కుల్లేఖింప సామాన్యమే! 6

[1]తగరు నగాధి రాజమున దార్కొనులీల, నఖండ సత్వతా
మొగలులతో విరోధమున మున్గిన నీ యసమానదీక్ష కెం
తగమది సంతసించెనో యుదార మనస్కుఁడు చక్రవర్తి! మీ
పగ పగ గాదు, మేలినగ! భారతమాతకు ధన్యు లిర్వురున్ ॥ 7

1. తగరు = పొట్టేలు.

తేజశ్శూన్యత రాజపుత్రసతి పాతివ్రత్య మానాడు2 "నౌ
రోజా" యుత్సవముల్ హరింప, నసమర్థుల్ మానసింపోదులా
మోజున్వీడరు చక్రవర్తికి గులాముల్గాన! నీ దీక్షచే
రాజిల్లెన్ రసపుత్ర వంశగత శౌర్యస్థైర్య చాతుర్యముల్! 8

కష్ట కాలాన దిగజారు ఘనుని పెంపు
బుద్బుదం బట్లు మాయమై పోవుఁ గాని
చిక్కు కెదురెక్కునట్టి సౌశీల్య గరిమ
నీదు సొమ్మింక దానికి లేదు చావు ! 9

ప్రాణం బుండిన నాల్గు నాళ్లు విపిన ప్రాంతాలలో నీ మహా
రాణిం గూడి, యనంత కష్టముల కోర్వం జాలుటం గాదె, ని
ర్యాణా నంతర సౌఖ్యదాయకములై "ఆరావళీ" పర్వత
శ్రేణీకందరగర్భగోళమున నిల్చెన్ నీ యశోగీతికల్ ! 10

ఏమో సౌఖ్యముఁ జెందఁగోరి మొగలాయీ దాస్య బంధమ్ము లం
దా మల్లాడుచుఁ గత్తిఁగట్టిరి గదా దాయాదులౌ క్షత్రియ
స్వామి ద్రోహులు కొందఱట్టియెడ నీ సంకల్పసిద్ధ్యర్థమా
[1]"భామాసా" తన సర్వసంపదలు నీ పాదద్వయిం జేర్పఁడే! 11

ఏ మాత్రంబు సహింపరాని మొగలాయీ పీడఁ దప్పింపఁగా
"నా మేవాడ వసుంధరాస్థలి శ్మశానక్షోణిఁ గావింతు, నా
నీమం బియ్యది దాటరా" దనెడు నీ నిశ్చయ మాత్మార్పణ
ద్యోమార్గంబునఁ బండు వెన్నెలలు గాయుం దారకాగోళమై! 12

ఊహాతీత స్వరాజ్య సాధన మహోద్యోగ ప్రవిష్టంబు నీ
మాహాత్మ్యం బెఱుఁగన్ సమర్థుఁడగు సామ్రాట్టాతఁడే! కానిచో
బాహాటంబుగఁ దానె నిన్మరల మేవాడం బ్రతిష్ఠించి, "అ
ల్లాహో అక్బరో" టంచు నీ భువన మెల్లన్ మ్రోయ వర్తించునే! 13

---

2. అక్బరు చక్రవర్తి యేటేటఁ జేయు వసంతోత్సవములు.

1. రాణాప్రతాపునకి స్వాతంత్ర్య పోరాటములోఁ దన సర్వస్వము నర్పించిన నొక ధనిక దేశభక్తుఁడు.

# కవిసార్వభౌముఁడు

భిన్నరీతులు మప్పుకొన్న నన్నెడల యొ
య్యారంపు సీసపద్యాల సొబగు!
తెలుఁగు సభ్యతను గుర్తింపించి వెలయింపఁ
జాలిన వీధి కావ్యాల సొబగు!
సంస్కృత పదసంధి సడలింపక రచించు
మేలి యాంధ్రానువాదాల సొబగు
స్త్రీ జన సౌందర్య చిత్రాల రసికతఁ
దేలించు చాటు పద్యాల సొబగు
ఆంధ్ర కవితా వధూటి నీ యందఁ జేరి
నేర్చుకొని ముద్దు ముచ్చటల్ దీర్చుకొనియెఁ!
గావ్యలక్ష్మికి రూపు రేఖలను దిద్దు
ఘనయశోవైభవంబు దక్కినది నీకు! 1

వినుతింపందగు విద్వధౌషధ మయః పిండంబులై పేరుమో
సిన కావ్యమ్ములు హర్షనైషధముఁ, గాశీఖండముం దెల్గొన
ర్చిన నీకుం గవిసార్వభౌమ బిరుద శ్రీ నాథతా వాప్తిచే
జనకుండుంచిన పేరు సార్థకము గాఁ జాలెం గవీంద్రోత్తమా! 2

చిఱుతనాడె 'మరుత్తరాట్చరిత' మాది
కావ్యరచనమ్ముచేఁ గీర్తిఁ గన్న నీకు
గౌడ భట్టారకుని గెల్చి కంచుఢక్కఁ
బగులఁ గొట్టించుటన నెంతపని మహాత్మ! 3

అన్నారు లోకుః లేమును
విన్నారము లోన నుంత విశ్వాసము లే
కున్నట్టి కల్పితాంశము
లెన్నో! పోతన్న బావయే నీకుఁ గవీ? 4

అఖిల భూనాథమౌళి సమర్చితాంఘ్రి
తలఁదవై యొప్పు నీవేడ! నిలువ నీడ
తిన్న జాడయు లేని పోతన్న యేడ!
బావ మఱఁదుల కిది యసంభావ్యమే మొ! 5

భంగాభంగ వివేక లౌకికమహాప్రజ్ఞాతరంగాలతోఁ
బొంగుల్వారిన బుద్ధి నీయది! యికం బోతన్నదో దైవతో
త్సంగ ప్రాంచదుదారసైతిక బలాంత ర్వాహినీ భూరిశ
క్తిం గైకొన్నది! గోచరించుఁగద తద్భేదమ్ము మీ గాథలన్ 6

"బాలరసాలసాల నవపల్లవ కోమలకావ్యకన్యకం
గూళలకీయ" నంచు నిజకుక్షికిఁ బస్తులు నేర్పుకొన్న ధీ
శాలియతండు! అగోచర విచారము మాని యిహమ్ముఁజూచుకోఁ
జాలిన దిట్ట వీవు! ఇరుదెసల్ పరికించి శిరమ్ము మోడ్చెదన్! 7

'సిరికిం జెప్పఁడ'టన్న పద్దియము నాక్షేపించి, లోకజ్ఞతా
పరిపూర్ణత్వము లేక బావమఱఁదిం బ్రశ్నింపఁ బోగా, నిరు
త్తరుఁడై యప్పటి కూరకుండి యటుపైఁ దత్వంబు రూపించె నం
దురు! పోతన్నను గొండకెత్తుటకుఁ బాథోధిన్ నినుం ద్రోయుటా! 8

శివభక్తిన్ వెలయించు నీకృతులు, రాశీభూతసారస్వతా
నవచైతన్యలసత్కవీంద్రజనతా సామ్రాట్టు వీవు; అంగనా
నివహం బెయ్యెడనైనఁ గంటఁ బడఁగానే, పచ్చిశృంగారఁపుం
గవితన్ గుప్పితి వంట! భక్తి పెరుగంగా రక్తియా నందువా! 9

తమ్ములపాకు లమ్ముకొను తన్విపయిం, దిరునాళ్ళ వింతవే
సమ్ములు దాల్చివచ్చు దొరసానులపై, నిజమందిరాంగణా
గ్రమ్మునఁ బిండి రుబ్బుకొను కాంతపయిన్, వెలయాంధ్రవైన, నీ
కమ్మని కైత గట్టుదెగి కాంతు గుబుల్కొన జాలువారెనా? 10

కెందలిరాకు పోదుముల గేలి యొనర్పఁగఁ జాలు మేని మె
త్తందన మొప్పియుం గఠిన దారు వినిర్మిత సాధనా హతిం
గందిన కోమలాంగుల వికారములం బరికించి, మానస
స్పందన మయ్యెఁ గావలయుః సారకళామయధన్యజీవికిన్! 11

ఉత్తమ సాహితీ గుణము లొప్పఁగఁగొబ్బరికాయపాకమున్
గుత్తకుఁ గొన్న కబ్బములకుం దెలుఁగుందన మీయఁ జాలు వి
ద్వత్తును జూచి రెడ్డి వసుధావరు లెల్లరు గౌరవింప హో
రెత్తకయున్నె యాంధ్ర జనయిత్రి, మునస్త్రకు పరంపరాహతిన్! 12

అలనాడాపలనాటి జీవితము నీ వత్యంత హేయమ్ముగాఁ
దలపోయం బనియేమి, పండిత కవీంద్రా? తింత్రిణీ పల్లవం
బులతో బచ్చలి, జొన్నకూటి మహిమంబుల్ షడ్రసోపేతమౌ
కలమాన్నంబు భుజించు భోగు వెఱుఁగంగా లేరు మందాగ్నిచే! 13

రాటముఁద్రిప్పు కుందరట రంభల వంటి నెలంత లంచు, నా
గేటిని బట్ట మానరు పకీరులతో వసుధేశు లంచు నా
ర్భాట మొనర్చితేల? నవభారతభాగ్యవిధాత లత్య మే
నాటనొ స్వీకరించెఁ బలనాడని మేము నుతించు చుండఁగన్! 14

చచ్చిచెడి మోయు బోయీల సాగనంపి
శిబిక నడిపించుకొన్న నీ చేవఁ జూచి
దుక్కిటెద్దుల నవలకుఁ ద్రోలివైచి
యరక సాగించెనంట, పోతన్న! నిజమె? 15

రెడ్డి ప్రభుత్వమేఁగఁగనె రేగిన వింత పశు ప్రవృత్తిలో
నొడ్డెలు రాజులై, సుకవితోజ్వల మూర్తికి బందకొయ్య పైఁ
బడ్డది! రాజభోజన శుభం బణగారిన మీఁద బుద్ధియే
చెడ్డది! కాక యేటికిఁ గృషీవల కార్యము బొడ్డుపల్లియన్? 16

అంతటి రాజభోగముల నంది, రసజ్ఞకవీంద్రకోటిలో
మంతున కెక్కి, జీవిత సమాప్త దినమ్ములలో సుఖమ్ము కా
నంతయులేక క్రుంగితి గదా! యిహసౌఖ్యమె ముఖ్యమన్న నీ
పంతము నెగ్గలే; దిపుడు భావమునందిని మెచ్చుకొందువా! 17

---

# రామరాజభూషణుఁడు

ఆయతభక్తి నీ రచన లన్నము నీరు దలంపఁ బోవ కా
ప్యాయతమైఁ జరించితిని బాల్యమునం దదికారణంబుగా
నాయెడఁదన్ సుఖాసన మొనర్చి, సమర్చ లొసంగు వాఁడ నీ
కే; యితర ప్రబంధముల కించుక మించు కళాన నీ కృతుల్. 1

అప్ప కవీంద్రుఁ డంచిత మహాశయతన్ నిజ ధర్మనిష్ఠమైఁ
జెప్పిన పల్కులెల్ల నిరసింపఁగ ధైర్యము చాలకున్న! దా
చొప్పున ధర్మసూక్ష్మమును సూరివరేణ్యులు మెచ్చుకుండినం
దిప్పలు దప్పవేమొ జగతిన్ రసవత్కవితా కుమారికిన్! 2

బట్టు కొలమ్మ నీకుఁగల పాండితికిం జెరుపయ్యె నంటయే
చెట్ట తలంపు; మేటి పరిశీలనఁ జేసినఁ గానఁబోము నీ
యట్టి కవీంద్రు రాయల యనంతర, మా కవితా విలాసముల్
బట్టుకుఁ గాక యన్యకవిపండిత కోటికిఁ గల్గనేర్చునే! 3

భాషా కావ్యములన్ రసాత్మకముగా, భావానుకూలమ్ముగా
శ్లేషల్ గుప్పుట నీ నిసర్గ కవితా శ్రీ చిద్విలాసంబుగా;
కాషామాషిగఁ బెక్కు పద్యముల రెండర్థంబు లేరీతిగాఁ
బోషింపం బడె? రామభూషణ కవీ! పుంభావవాగీశ్వరీ! 4

శైలత్వమ్మున కాపగాత్వమునకున్ సంసార బంధమ్మె! పై
బాలారత్న పముద్భవం బఁట! నిలింప వ్రాత మర్దింప భూ
పాలోత్తంసునితో వివాహమఁట! యల్పమ్మె కథావస్తు వీ
లీలన్ నీ దగు సిద్ధహస్తమునఁ దాల్చెన్ దివ్య కావ్యాకృతిన్! 5

"కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము" లన్న యూహచేఁ
గావలె నీ వరాం కవిగంటమునం బ్రభలింపఁబోవు శో
భావహ భావనా విలసి తాంధ్ర కవిత్వ పటు స్వతంత్ర కా
వ్యావళి! సాహితీవిదు లహర్నిశముం దల లూచి మెచ్చఁగన్. 6

ఏ కులతత్త్వ వాదియొ రచించి ప్రచారబలమ్ము కోసమై
చేకొని 'రామలింగ కవి' శీర్షము నం దిడు కొంటెచాటుపుల్
గాక! యతండు నీవు సమకాలికులా? నినుఁ గూర్చి పాండితీ
శ్రీ కమనీయ కావ్య కవిశేఖరుఁ డాతఁడు బూతు లల్లునే! 7

అట్టిటు కొండెముల్ వలికి యాగ్రహముం గలిగింపఁ జూచినా
రట్టె నృపాలమౌళి కనుఁయాయులు! తత్కపటం బెఱుంగునై
"లొట్ట యిదేటి మాట" యని లోకము నే దిగమ్రింగు పోల్కి నీ
కట్టిన కైత వంచకుల కన్నులు విప్పిన వోయి సత్కవీ! 8

"బలి చూడామణు" లంచు నాత్మకులముం బైకెత్తి కొన్నాఁడ; వం
దులకై సంతసమయ్యె! కాని చరణోద్భూతత్వ మావెంటనే
పలికెన్ గంటము! నిన్నుఁ బోలు కవికిన్ వర్ణవ్యవస్థా హాలా
హాలమున్ మ్రింగక తప్పదయ్యెను గదయ్యా నాటి సంఘ స్థితిన్! 9

కాలమ్మొక్క చతుశ్శతాబ్దములు వెన్కం ద్రోయఁగా శక్తి యే
నాలో నున్న యెడన్, మరొక్కరుని కన్నన్ మున్నుగాఁ బాండితీ
శ్రీ లోలున్ నినుఁ జేరి త్వత్పదములన్ శీర్షమ్ము సంధించి, కా
వ్యాలంకార మహా ప్రబంధ రచనా వ్యాహార మీక్షింపనే! 10

కొనగోట గట్టు మీటి నగారి నతు లందు
మొనగాఁడు 'వసు' నామ జన విభుండు!
నాయక నాయికా నవ సమాగమ కళా
మర్మజ్ఞుఁడగు మేటి 'నర్మ సఖుఁడు!'

ప్రకృతి పదార్థ సంపద నోలలాడు సౌం
దర్య సాద్గుణ్యావతార 'గిరిక !'
యంత్ర పాంచాలికాభ్యంతర స్థితిఁ బ్రేమ
మాధుర్య మొలికించు 'మంజువాణి !'
శబ్ద రత్న ప్రభా భావచయ సువర్ణ
కీలితములైన నాల్గు కంబాలు గాఁగ
రసిక పండిత వినుతమౌ 'వసు చరిత్ర'
కావ్య సౌధంబు నిర్మింపఁ గలిగి తీవు ! 11

పెద్దన యొద్ద భక్తియును బేర్మిముడి మీరఁగ నేర్చినావఁటే
విద్దెలు; సంస్కృతాంధ్రమణివేశ్మములన్ విహరించినావఁటే,
పద్దెము పద్దె మందున సెబాసుగఁ గూర్చితి వెట్లు శ్లేషతో
ముద్దులు మూటఁగట్టు నవమోహన కావ్యకళా విలాసముల్! 12

'మను చరిత్రమ్ము' విని పల్లకీని దనంత
నెత్తి, బోయీల బుజముల నిడిన రాజు
వసు చరిత్రమ్ము విన్న సంతసము పొంగి
నిజ భుజాగ్రమ్ము లనె నిన్ను నిల్పుకున్నె ! 13

# భారతీయుఁడు

సకల దిగ్దేశ రాజన్య సేవితమైన
　　　సార్వభౌమత్వమే జాదఁబోయె?
భవ్య పరబ్రహ్మవస్తు నిరూపణా
　　　ఖండ విజ్ఞానమే కడకుఁ బోయె?
శత్రు సంహార దోస్సార భాసుర సువి
　　　శాల శౌర్యాగ్నియే మూలడాగెఁ?
బరమాత్ముఁ దక్కఁద క్కొరు వేడఁబోవని
　　　స్వేచ్ఛాను రాగమే చెంత కేఁగె?
కట కటా! యనివార్యమౌ కాలనియతి
సర్వశక్తు లదృశ్యమై స్వార్థమొకటె
నిలిచి యున్నది నీలోన! జలము లింక
మిగిలినోయెడు పంకంబు పగిది నిపుడు !

రాజ నీతిజ్ఞులై తేజరిల్లిన పూర్వ
　　　దండనాథుల సుంత దలఁచుకొన్న
రణరంగముఁ గవోష్ణ రక్తధారల నింపు
　　　రెడ్ల శౌర్యము విచారించుకొన్న
వసమాన మానధనాగ్ర పూజితులైన
　　　రాజపుత్రుల పరాక్రమము విన్న
పరదేశములఁ జేతఁబట్టి పాలించిన
　　　పూర్వ సామ్రాట్టుల పోలుపుఁ గన్న
తనువు పులకించి, వాడి వత్తులయి యున్న
జీవనాడుల కొక్కింత చేవ గలిగి

భావదాస్యమ్ము విడిపోయి భారతీయ!
కార్యభారత నీలోనఁ గదలిరాదె ! 2

కులభేదతత్వ మాపలకుఁ ద్రోయక యున్న
బుద్ధి మాంద్యము కూలిపోక యున్న
హిందూ ముసల్మాను లేకంబు గాకున్న
జాతి వైషమ్యముల్ సమయ కున్నఁ
బూర్వ దుష్టాచారముల మార్చుకొన కున్నఁ
జెఱసీమలన్ దృష్టిఁ బఱప కున్న
దేశభక్తుల మొరల్ దీక్షతో వినకున్న
భారతఁ గ్రియలలోఁ జూప కున్న
పూర్వ సౌభాగ్యమును మనంబునఁ దలంప
వేడి కన్నీటి బిందువుల్ వెడల కున్న
విశ్వమానవ కళ్యాణ వేదిపైన
నడు గిడఁగలేవు భారతీయుఁడ నిజమ్ము! 3

——

# రాష్ట్రస్తుతి

పలు సంవత్సరముల్ గతించిన, వనల్పంబైన త్యాగంబులన్
సలుపం గేంద్ర మొసంగినట్టి మన రాష్ట్రశ్రీకి నిన్నాళ్ళలో
పలఁబై కొన్న బృహజ్జయాప జయ సంభావ్య ప్రభావమ్మె, రా
గల కాలమ్మున మార్గదర్శియయి, సంకల్పంబు సిద్ధించుతన్. 1

ఎన్నో యేండ్లుగ రాష్ట్రసిద్ధి కొఱకై యెంతెంత త్యాగాలొ మా
యన్నల్, తండ్రులు, తల్లులున్ సలిపినా రాద్యంతముం; బైని మా
[1]పెన్నాతీరపు యోగి తా నసువు లర్పించెన్, భవద్విశ్వరూ
పౌన్నత్యమ్ముఁ దలంచి, వాని కిడు మాతా నీ శుభాశీస్సులన్. 2

ఈ బహు నాయకత్వమున నేర్పడు పాక్షిక రాజకీయఁపున్
దేశ తనమ్ము కాలి కోలఁదిం బోలి మేరల దాటిపోవు నా
డే, బహుళాంధ్ర కీర్తి వికసించి, తెలుంగుల దుర్నిరీక్ష్య తే
జో బలవైభవమ్మునకు సూడిద లిత్తురు భారత ప్రజల్. 3

ఎంగిలి కూటి నైచ్యము ఘటించిన రాచరికాన దేహమే
క్రుంగియుఁ బ్రాణముల్ నిలుపుకో, నెటులో విడిపోయె స్వప్రజా
భంగ కఠోరదీక్షఁ బర పట్టణవాసము! స్వీయ మందిర
ప్రాంగణ సీమలోఁ బసుపు పాదము మోపఁగఁ గల్గె నాంధ్రికిన్. 4

ఆశీర్వదించినాఁ డఖిల భారత ధారు
ణీశ్వరుండైన రాజేంద్రబాబు
అతి మనోహరపురోహిత భాషితము లాడె
హోరెత్తిపోవ నెహ్రూ ప్రధాని

---

1. కీ. శే. పొట్టి శ్రీరాములుగారు.

హృదయ నైర్మల్య మిం పొదవు సూక్తుల నెన్నొ
పలికె రాధాకృష్ణ పండితుండు
పరిపాలనా మహత్తర భారమును మోయ
శిర మొగ్గె 'నాంధ్రకేసరి' ప్రకాశము
ఆవతరించిన తొలినాడె యఖిల దేశ
చిర శుభాకాంక్షలకు మేను పరవశించె;
నింక నీకేమి కొదుఁవ సాగింపు మమ్మ
శాతవాహన సంస్కృతీ జైత్ర యాత్ర! ౫

అక్షీణ ప్రతిభాసమంచితులు సుమ్మా, గౌతమీ, కృష్ణవే
ణీ క్షీరోదకపాన తత్పరతచే నీ బిడ్డ; లవ్వారి యో
గక్షేమమ్ములు చూచుకొమ్ము; యువరక్త ప్లావిత మ్మీ ధరి
త్రీ శోభన్ వెసఁ రూపుమాపెదరు శాంతి స్థాపనాచార్యులై! 6

ముమ్మాలల్ గన మల్లికార్జునుని, భీమున్, కాళహస్తీశ్వరున్
సమ్మోదమ్మున నిల్పికొంటివి భవత్సంరక్షణార్థంబు! లో
భమ్ముల్, కక్షలు, హెచ్చుతగ్గులు నశింపం జూడుమా, యైకమ
త్యమ్మున్ బిడ్డల కుగ్గుతోఁ గఱపుచుం ద్రైలింగరాజ్యాంగనా! 7

పూర్వాంధ్ర మ్మని పశ్చిమాంధ్ర మని కంపుం గొట్టు వాగ్వాదముల్
పర్వెన్ దిక్కుల నీ నివాసమున కంబా! కొంత కాలమ్ముపై
సర్వమ్మున్ దిగజారి చక్కఁబడె; నీసంతాన మావేశవా
క్పూర్వుల్ పశ్చిమబుద్ధులన్న నుడి రూపున్ మాపి కాపాడుమా! 8

ఆంగ్లరాణి కిరీట మందుఁ జిందులు ద్రొక్కు
'కోహినూరు'లు నీకు గులక రాళ్ళు!
నాగార్జునుని కొండ నాల్గు మూలల దాగు
శిల్ప సంపద నీకుఁ జిత్తు ప్రాఁత!

గోపన్న యెడఁదలో రూపొంది మిన్నందు
భక్తిభావము నీకు బాల్య చేష్ట!
రసము లూరఁగఁ ద్యాగరాజు కంఠములోనఁ
గులుకు గానము నీకు మానురాగ!

మనుపమాన ప్రభావ భావాతి మధుర
మధుర సోపమ కవితా ప్రమాణ మహిత
బహుళ కావ్యాను మోద సంభావనమ్ము
కేవలము నీకు శైశవ క్రీడ తల్లి!! 9

నన్నయ నాడు నేర్చిన యనంత సుసంస్కృత శబ్ద జాలఁపుం
కిన్నెర మీటి, భూపతుల కీరితిఁ బాడితి కొండవీటిలోఁ,
గ్రన్నన హంపి, తంజపురి రాజ్యములన్! మఱి నేఁడు స్వప్రజా
భ్యున్నతి తోడి జీవిత నవోదయముం గను మాంధ్రభారతీ! 10

శిరమే యూడి నిజాము రాజ్యమున నిల్చెన్, చెన్న రాష్ట్రింబులో
దొరకెన్ మొండెము, ప్రాణ మున్నదియొ లేదో చెప్పఁగా రాని దు
ర్భర దైన్యస్థితి యంతరింపఁ బొడమెన్ రాష్ట్ర స్వరూపమ్మునం
బరిపూర్ణత్వము, నాత్మశక్తియును, జీవద్భాగ్య మీనాటికిన్. 11

'కొండా', 'న్యాపతి', 'దుగ్గిరాల' లసువుల్ గోల్పోయిరే దేవి యు
ద్దండ ప్రాకృత రూప దర్శనము నందం గోరియుం గోరికల్
పండం జాలని చింతచేఁ జీవికి, యా భవ్యస్వరూప మ్మిదే
కండో బిడ్డలు! మాతృమూర్తిని సమారాధించి కీర్తింపఁగన్. 12

హిందూ, బౌద్ధ విశిష్ట ధర్మములతో, 'నిస్లామ్' పురాసంస్కృతీ
కందంబై విలసిల్లు సోదర 'తెలంగాణా' మహోద్యత్కళా
సౌందర్య మ్మతివేల్పమై, యిపుడు నీ సాంగత్యముం జేరె! నీ
యందమ్మెల్లెడ నద్వితీయము! విశాలాంధ్ర ప్రదేశాంబికా! 13

అదిగో నిస్తుల పూర్వవైభవ సముద్యద్దివ్యగానమ్ము మా
యెదలం దాకఁగఁ జేయుఁ గావ్యతతి, తల్లీ! మేనులఁ బుల్కరిం
పాదపం దెల్గుల 'శాకుటా' శిరముల న్దొప్పార యావత్ప్రజల్
కదనుం ద్రొక్కిరి, ప్రాక్సముద్రగత నౌకాయానఁపుం గాథలన్! 14

తిరుపతి వేంకటేశ్వరుని దివ్యమునం బడి మూల్గుచున్న బం
గరు కణికల్ వృథావ్యయము గాని తెలుంగునఁ, గీర్తిమూలమై
చిరతరమైన శాధ్యతమ శీర్షమునం బడవైచినావు! నీ
కోరఁతలు దీరి యింకఁ దెలుఁగుం బస సర్దిశ లాక్రమించుతన్! 15

ఆంధ్రుల చరితలో నడఁగి గుబాళించు
శాతవాహన కళా సౌరభమ్ము
జగమగంటిమిఁ జూపి పగఱ మెప్పించిన
కాకతీయాహవ కౌశలమ్ము
వ్యాసవాణినిఁ దెల్గుబాస సింగారించు
పూర్వచాళుక్య భూభుజ యశమ్ము
తెలుఁగు వెల్గుల దేశదేశాల నింపిన
విద్యానగర రాజ విక్రమమ్ము
పలుదెఱంగుల కథలు, గాథలుగఁ జెప్పి
కలిసి, తెలుఁగు జనమ్ము లేకముగఁ బాడఁ
దన్మయత నొందు శుభముహూర్తమ్ము గాన
నసుఁగు బిడ్డల దీవింపు మాంధ్ర మాత! 16

అల హిమాలయ, ప్రాక్పశ్చి మాంబు నిధులు
భారతక్షోణి కవధులై పరగు దాఁక
నాంధ్ర రాష్ట్రావతరణ శుభాంకముద్ర
తెలుఁగువారల హృదయాల వెలుఁగుఁగాక! 17

—

# కృష్ణవేణి

పడమటికొండ సానువులపైఁ బ్రభవించి, నిజాము రాజ్యఁపున్
గొడవలలోనఁ జిక్కి, యదిగో పదిలమ్ముగఁ దెల్గు సీమలో
నడుఁగిడి, వింతరీతుల నొయారఁపు నెన్నడ లొప్పసాగి, మా
యుడుగర లంది, ప్రాగుదధి నూర్మికరమ్ములఁ గౌగిలించితే! 1

పాలముల్ మ్రింగు నగాధ భీకర జలంబుల్ పుక్కిటం బట్టి, ని
ర్మల నిస్స్వార్థ మనోహరమ్ములగు 'భీమా' 'తుంగభద్రా' దులా
చెలికత్తెల్ స్వగతోర్మికా నికర మంజీర ధ్వనిన్ డాసి, దా
పలి కేలున్ వలకేలు బట్టినవికావా? ముద్దు ముచ్చట్లకై! 2

కుంటలు, గొట్టులు, కుచ్చెళ్ళుఁగా భూమి
పంచల జతల కర్పించునాఁడు!
అధికార్ల బండ కొయ్యకు జంకి 'శిస్తు' పో
కడ పొలాల్ బీళ్ళుగా విడచునాడు!
పల్లాలలోఁ దాళ్ళబంటి వెల్లువ నించు
నతివృష్టిచే బాధ లందునాడు!
విత్తినపైఁ జినుకు వీసమేనియు లేక
'యుత్తర'ఁ జూచి గంపెత్తునాడు!

అపగాధీశుతోడ సయ్యాట లాడు
వలపు పొలపున మలకలై వచ్చు నీకుఁ
దీరకేదారముల వంకఁ దేరి చూచు
బుద్ధియే పుట్ట లేదేమొ, పుణ్యతటిని! 3

ఉప్పుల్ గారెడు చౌటినేల లఁట మా యూళ్ళన్నియుం దొల్లి! నీ
యప్పుల్ వారి, తదూషర ప్రకృతిఁ జెండాడన్ సువర్ణమ్ముమ్రలే
కుప్పలోల్వోయు విధానఁ దోచు వరికుంకుల్ నేఁడు! శాల్యన్నమే
ముప్పూటల్ భుజియింపఁ జేసితివి మమ్ముం గృష్ణవేణీ సతీ! 4

నీ చను బాలతోఁ బెరుగనేర్చిన కోట్ల కొలంది బిడ్డలం
గాచు కొనంగ ధర్మమగుఁ గాని, సుతుల్ విలపించు చుండ సం
కోచము మాని యన్యులకుఁ గూర్తువె నీ సిరి? [1]రాజకీయఁ పుం
బాచిక పాటినందెలుఁగుపై దలి పేదరికానఁ గ్రుంగదే? 5

తిలకించినావు, దేదీప్యమాన ప్రభా
కలిత వైభవ [2]ధాన్య కటక లక్ష్మిఁ!
బరికించితివి, తెల్గు దొరతనానికి వెన్ను
పోటు నాటిన [3]తల్లికోట పోరు!
వీక్షించితివి, [4]విశ్వవిద్యాలయో పాంత
నివస దంతేవాసి నిత్యగోష్ఠి!
జరిపించితివి, భక్తవరుల ముంగొంగు బం
గారమ్ముఁ [5]గనకదుర్గా ప్రతిష్ఠ!
శీత లోత్తుంగ తుంగభద్రా తరంగ
మాలికా బాలికా నీత మధుర భవ్య
విజయనగ రాంధ్రవైభవ ధ్వజ నినాద
మాలకించితి వెట్టి దివ్యానుభూతి! 6

---

1. లోగడ నొకప్పుడు కృష్ణా జలమును మద్రాసు వారికి పంపవలె నని యోజన జరిగినది.

2. యిప్పటి 'ధరణికోట'.

3. క్రి. శ. 1556లో జరిగిన యీ యుద్ధములో విజయనగర సామ్రాజ్య పతనము జరిగినది.

4. నాగార్జున విశ్వవిద్యాలయము.

5. విజయవాడ రైల్వే స్టేషన్ కెదురుగా కొండపై వెలసిన కనకదుర్గాంబ.

భాద్రపదము వచ్చి పైబడి నంతనే
తీరవాసి గుండె దిగులు హెచ్చ !
బొంగివచ్చి కొంప, బొలముఁ, బ్రాణముఁ గూడ
నష్టపఱతు వన్న నమ్మకమున ! 7

పెద్దఱిక మెంత గలదో
గద్దరి తన మంతగలదుగా ! తటినీ ! నీ
యొద్ద; వినుతించు నోటనె
వద్దుగ నిరసింపఁ దగిన పనియుం గలిగెన్ ! 8

6అడిదము రామ కవీంద్రుని
బెడిదంపుఁ బల్కులకుఁ దోకఁ బీకితి వంటు! ని
న్నడికింప నేర్పు జాలని
బడుగులకా కఠిన శిక్ష! పాడి యిదేనా? 9

ప్రాకట వైభవాస్పదముఁ బ్రాణసమంబగు రెడ్డి రాజ్యమే
కూఁకటి వ్రేళ్ళతో విఱిగి కూలిన నాడు పరప్రభుత్వ మ
ఱ్ఱాఁకలఁబెట్టఁ బొట్టకొఱకై మడి దున్నిన [1]'క్రొత్తకాపు' పైఁ
గాక వహించినా వంటు! జగంబిది మెచ్చునె? జోత లిచ్చునే? 10

---

6. క్రీ. శ. 1750 ప్రాంతము వాఁడగు నీ రామ కవి తన చేలపై గంగ వెల్లివలై పాఱఁగా, మొలలోతు నీటిలో నిలఁబడి యా మహాకవి "కదలు మిటమాని దివిజ గంగా భవాని!" అను మకుటముతో నావేశమునఁ గొన్ని పద్యము లాశువుగాఁ జెప్పఁగా, వెంటనే నీరంతయుఁ దీసి పైరు బయటఁ బడెనని "చాటు పద్య మణిమంజరి"లోఁ జెప్పఁబడి యున్నది.

1. ఈ క్రొత్త కాపెవరో కాదు. కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడే!

[2]అకలంకమ్మగు దీక్ష ముందునకుఁ ద్రోయన్, స్వప్రజానీక సే
వకునై చీఁకటివేళ నిర్భయముగా, వైజ్ఞానికోద్యత్క్రియో
త్సుకతన్ నీయొడిఁజేరు యాంత్రికుల గొంతుల్ గోసినావన్న వా
ర్తకు నిశ్చేష్టుఁడ నైతి! లేఖిని తనంతన్ నిల్చె నిర్జీవమై! ! 11

---

2. అది క్రీ. శ. 1956వ సంవత్సరము. సెప్టెంబరు నెల. (భాద్రపద మాసము) నిండు వర్షాకాల మగుటచే విజయవాడ యొద్ద కృష్ణానది వరవళ్ళు ద్రొక్కుచుఁ బ్రవహించుచుండ ఆనకట్టకు గండిపడెను! అట్టి భయంకర సమయములో నెవరును గండి పూడ్చుటకుఁ బూనుకొనరైరి. అప్పుడు కొందరు యాంత్రికులు (Engineers) ప్రాణములకు తెగించి రెండు నాటు పడవలపైఁ గావలసిన సామగ్రితో నదిలో గండివైపు పోవుచుండిరి! అంతలో నొకపెద్ద వెల్లువ రాగా వారి పడవలు తలక్రిందులై కొట్టుకొని పోయినవి; యాంత్రికు లెవ్వరును బ్రతికి బయటఁ బడలేదు; ఈ విషయ మానాటి పత్రికలలోఁ బ్రకటింపఁ బడినది. ఆ యాంత్రికులలోఁ బ్రసిద్ధుఁడు శ్రీ వేపా కృష్ణమూర్తిగారు. ఈ వార్త వినఁగానే గలిగిన యావేశములో నీ పద్యమును వ్రాసి అప్పటికే వ్రాయఁబడియున్న 'కృష్ణవేణి' యను ఖండికలోఁ గడవటఁ జేర్చితిని.

---

# గాలిపటము

చదువుఁ జెప్పిలేచి, సాయంతన విహార
లాలసత్వమునఁ బొలాలకేఁ గి
కూరుచుంటి; మోము (గొండొక పైకెత్తఁ
గంటఁ బడియె నొక్క గాలిపటము. 1

చూడఁ జూడంగ వింతయౌ జాడ రేగు
నలఁతి యూహల కాస్పదంబయ్యె మనసు!
కవితతోడయ్యెఁ! గూను రాగాల తోడ
నాలపించితి హృద్భార మంతరింప. 2

చిత్తుకాగితములు, చీపురుపుల్లలు
గోచిపాత లేర్చి కూర్చినట్టి
వింతజీవి వొక్కొ! వినువీధి కెగఁ బ్రాకి
యలఁతలేక నాట్య మాడెదీవు! 3

తుక్కుమంచానఁ బడియుంట గోడవెనుక
భాగవత మేమొ మాకంటఁ బడదు గాని
గగనమునఁ బ్రాకు నీకు లోకప్రవృత్తి
సులభవేద్యము కరతలామలక మట్లు! 4

వికట గృహోపరిస్థలుల నింగిఁ జరించెడు వేళ నుంతలో
నికఁ గనువిచ్చి చూడకుము! నిర్భయతన్ విజనాంగణాన! మే
నికి వలుగుంబసందునిడు నీరజగంధి పరప్రతీక్షచేఁ
జకితమనస్కయౌచు నటఁ జాటుగనేని నినున్ శపించెడిన్! 5

మేని తొగరున కెంతయో మిడిసిపడుచుఁ
గ్రిందెఱుంగని గురిగింజ చంద మొప్ప
నూర్ధ్వ గమన ప్రశస్తికి నుబ్బిపోకు
గాలిలోఁ దేలు టెంత లాఘవము నీకు! 6

తోఁక విదల్చుచుం బడగతో బుసవెట్టి యదల్చు ఘోర ద
ర్వీకర మట్లు సాగి వినువీధి నరుంతుదు పోల్కి నొప్పు నీ
తాకున కోడి గాదె, జలద ప్రతిసీర మఱుంగుఁ జొచ్చినాఁ
డా కమలాప్తుఁ డల్లదె విహాయస లక్ష్మి కలంగి పోవఁగన్ ? 7

అన్నా! సాంఘిక, రాజకీయ, ధనికాహంకార జన్యమ్ములై
యెన్నో జాడ్యము లావరించినవి మా యీభూస్థలిన్! శూన్యమం
దౌన్నత్యమ్ము వహించి జీవితములో హాయిం గనుంగొందువా?
మిన్నున్ మన్ను సమంబె, శాంతి సుఖముల్ మృగ్యంబులే
యందువా! 8

చేటుం బాటుల కగ్గమైన కపట స్వేచ్ఛానుభూతిన్, నిరా
ఘాట ప్రాకృత కర్మసూత్ర మెటు లాగన్ తద్గతిం బోవు మా
బోటుల్, స్వానుభవ ప్రభావమున నీ పోకన్ నిబంధింపఁగా
ద్రాటంగట్టి ముదంబు నొందుట విచిత్రం బౌనె యూహింపఁగన్? 9

# నేను.

అన్యదేశాల సౌహార్ద మఖిలమించి
పరమతాచారములలోని భావ మరసి
పూజ్యమై యొప్పు లౌకిక రాజ్య సుఖము
రుచి నెఱింగిన మేటి పౌరుఁడను నేను.

లేని శబ్దాల సృష్టింపఁ బూనుకొనక
కల పదమ్ముల జీవమ్ము లొలుక మలచి
విధి నిషేధమ్ములకుఁ బూర్తి విలువ నిచ్చి
కావ్య నిర్మాణ మొనరించు కవిని నేను.

కట్టుఁబాటులు లేనట్టి కాంత యేమి
కట్టుఁబాటు లేనట్టి గాన మేమి
కట్టుఁబాటులు లేనట్టి కవిత యేమి
పతితము లఁటన్న ప్రాచీనమతము నాది.

నేటి కుల గోత్రముల పొంగుపాటు లన్ని
మంట యే! కాని వర్ణాశ్రమములఁ దొల్లి
యేర్పరచిన పూర్వుల యింగితమును
మెచ్చుకొనకుండఁ జాలని మెదడు నాది.

సుప్రతిష్ఠితమౌ నైతిక ప్రమాణ
సంపదకు దూరమైయున్న జాతి కెందు
స్వపరిపాలన మందుఁ గష్టమ్ము మీఁదు
మంచి క్రిందౌ నటన్న నమ్మకము నాకు.

సాంప్రదాయాల నెన్నడో సాగనంపి
జుట్టు, కట్టులలోని నాజూకుఁ బెంచి
స్త్రీపురుష భేదమే రూపు మాపఁ జూచు
వెడగు సభ్యతపై మోటి విఱుపు నాకు. 6

ఉన్నతులఁబట్టి దిగలాగ నుద్యమించి
పతిత జనములఁబైకెత్తఁ బాటుపడని
వంచనాత్మక సంస్కారవాద సరణి
నూఁతఁగాఁ గొనువారిపై రోఁతనాకు. 7

పావనాశ్రమవాససంపర్క ముడిఁగి
వేశ్యతోఁగూడ కాఫీ హొటేళ్ళ మీఁది
బల్లలం గూలఁబడ్డట్టి బ్రాహ్మణత్వ
జీర్ణవృక్షాన నాదొక్క శిథిల శాఖ. 8

ఉంచిత జ్ఞాన మృష్టాన్న మభిలషించు
భావి పౌరుల కొక ముష్టిఁ బాఱవైచి
కడుపు నిండింప నన్యమార్గ ప్రసక్తిఁ
జిత్తగించు నుపాధ్యాయవృత్తి నాది. 9

దక్షిణాపథమెల్ల మా తాత లెపుడో
కోరమీసాల బలిమి లోఁగొనిన నేమి!
స్వీయ రాష్ట్రానఁదలయెత్తు ఛిద్రములను
దొంగి చూడని నవయుగాంధ్రుఁడను నేను. 10

—

# బాలచంద్రుడు

అన్యచరితములకు నట్టు సొచ్చు గుణంబు
స్వీయ చరిత కెపుడుఁ జేటుఁ దెచ్చు;
రత్న రాసు లుండి రాళ్ళకై వెదకు నీ
కలిమి యెవరికొఱకుఁ దెలుఁగునాఁడ! 1

ఉత్తరభారతాన నెపుడో ఘటియిల్లిన రాజవంశ వి
చ్ఛిత్తికిఁ బాండితీ ప్రతిభ జీవము వోయఁగ "భారతమ్ము"గా
నెత్తికి నెత్తి మోయుదువు; నీ పొలిమేరను 'నాగులేటి' లో
నెత్తురులోడ్చి చన్న మహనీయుల గాథ నినుం గదల్పదా? 2

గురుజాల ప్రభుఁ డల్గురాజునకు, భక్తుండై, మహామంత్రియై
యురువుం గాంచిన దొడ్డనాయనికి నేలో కల్గె నాగాంబపై
నరిభావ, మ్మసలీ చిదంబర రహస్యం బేమొ యీనాటికిన్
నరులన్ వీడదు! విప్పి చెప్పుటకు నా నాగమ్మయే రావలెన్!! 3

అదిగో కార్యమపూడి! చూడు మట బ్రహ్మాండమ్ముగా సాగుచు
న్నది బ్రహ్మన్నదెసన్ మహా సమర సన్నాహమ్ము నాగమ్మపై!
ఇదియే యిచ్చట 'వీరమేడపి' కిర; మ్మి బొంగరాలాడువాఁ
డుదిత ప్రజ్ఞుఁడు బాలచంద్రుఁడు! వినండో సంగరార్భాటముల్! 4

పొంగు భుజశక్తి లోహపు బొంగరమ్ము
విసరినాఁ డల్లదే! త్రోవ మసలు చున్న
వైశ్యకాంతకుఁ దగుల, దుర్వార రోష
పరవశత్వాన నేమియో పలుకు—వినుము— 5

"మతి మంతుడగు బ్రహ్మనాయఁడట ధర్మప్రాభవస్థాపనా
చితఘోరాహవ నర్తకి మణికి గజ్జెం గట్టుచున్నాఁడు; నీ
మతిహీనత్వ మిదేమి? యౌవన మదోన్మత్తుండవై, యంగనా
తతి బాధించుట పౌరుషం బఁటర వందా! నీకుఁ బోఁగాలమా! 6

హిత మాలింపని రాజ వంశమును దానే చీల్చి చెండాడి, పా
లోలితకోద్ధరణం బొనర్చుటకు నిల్చెన్ దీక్షమై నెవ్వఁ, డా
పితకున్ గుండెలలోన గ్రుచ్చుకొను నీ భీరుత్వఁపుం జేష్ట; తే
గతి మన్నించునో, వీరపత్నినని చంకల్ గొట్టు 'నైతమ్మ'యున్?" 7

వగ వెలుంగని బాలుని నగు మొగానఁ
దాండవించెను బెనుచింత; తక్షణంబ
చెక్కులం గట్టుకొన్నట్టు రివ్వమంచు
వ్రాలినాఁడదె, తల్లి పాదాల మ్రోల! 8

బెంగతో లోవనే దిగమ్రింగుకొన్న
సమర వృత్తాంత మామెను సాగఁదీసి
తేల్చుకొన్నాఁడు! మాతృ సందేశ మరసి,
పయన మయ్యెను 'మాంచాల' భవనమునకు! 9

కావు లొల్కెడు వీరగంధమ్ము నద్ది!
కొమరుఁ గుల్కెడు వీర కుంకుమము దిద్ది!
కదియఁ బోయిన తరుణ శృంగారమూర్తి
వేషమే మార్చినది లోన వీరపత్ని!! 10

పలనాటం జెలరేగు విప్లవములోఁ బాల్గొంటకై తోడినె
చ్చెలు లేతేరఁగ బాలచంద్రుఁ డిదె వచ్చెన్ 'మేడిపిన్' వీడి; యీ
విలయాభీల మహానలోపమ జగద్విఖ్యాత విక్రాంతిలో
వెలుగుం గోటి స్వతంత్రరాజ్యగతుః లుర్వీగతప్రనిక్షిప్తముల్! 11

బాలచంద్రా! యదేమయ్యె, ప్రాణ సఖుల
నొక్కపరిఁ జూచి తొట్రుపాటొందె దేమి?
తెలిసినది లెమ్ము! నీ లోన నలముకొనియె
బ్రహ్మహత్యా మహాదోషభయ మొకండు! 12

దురముం జేరఁగ నీక మిత్రుఁడన పోతుం జీరి, "మాంచాల మం
దిర మందున్నది చంద్రహార మిటు తే తెమ్మం"టివా, యెంత నే
ర్పరి! పీ మోస మెఱింగి యాతఁడు స్వధర్మమ్మున్ నిరూపింప నె
త్తురుజందెమ్మునెపాన నీ కొసఁగలేదో వీర సందేశమున్! 13

ఓ నిర్నిద్ర పరాక్రమా! జనకుఁడేవో శాంతి వాక్యాల నీ
కానం బెట్టఁ దిరస్కరించి, భుజగర్వాటోపముం జూపి, నె
మ్మేనున్ వీడితివా! భవద్విమల గంభీరా హవక్రీడచే
నే నాడో వెలసెం గదోయి, పలనాడే మా కురుక్షేత్రమై! 14

# మధుపనిర్వేదము

ఊదిన పొట్టబాధ కెవరో వివరించిన మందుఁ దేనెలోఁ
జాది రవంత పుచ్చుకొని చల్లఁగ నాలుకఁ జప్పరించి, యా
హ్లాదము నొందు నాకుఁ జెవులం బడినట్లుగఁ దోచె నింతలోఁ
బాదపశాఖికాంతర విపన్న మధువ్రత శోకగీతికల్! 1

"మా సామ్రాజ్యమునం గనంబడవు దుర్మార్గ ప్రసంగబులున్,
మోసంబుల్, పరసౌఖ్యసంహరణ సమ్మోహాస్త్రముల్, మూఢ వి
శ్వాసంబుల్; నియామాను బద్ధమగు స్వేచ్ఛా జీవితంబన్నమా
దే సుమ్మీ సకల ప్రపంచమున, సందేహంబు లే దింతయున్! 2

స్వాభిమాన ప్రపూరిత శతసహస్ర
మక్షికా భోజనంబైన మధువు నొక్క
స్వార్థపరుఁ డూడ్చి తెచ్చి యొసంగ నిట్టు
లారగించెదు! జాలిలేదా మహాత్మ!!! 3

నిరతానీత సుగంధ బంధుర సుధా నిష్యందమై, యంతరాం
తర షట్కోణ విభాగ సుందర కళానైపుణ్య విజ్ఞాన భా
స్వరమై, విశ్వవిలాస గర్భిత రహస్యస్థాపనాదివ్య మం
దిరమై, యొప్పుఁగదా మదాలయము! దానిం గూల్చుటానందమే? 4

పొంచి, నికృష్టమౌనుదరపోషణ కొక్కనరాధముండు, పై
పంచె ముసుంగు, కట్టియును, బల్లెము, గొంగళి, వేపమండచే
కుంచియ దాల్చి, మాగృహముఁ గూల్చఁ గడంగెడి! మారణాయుధో
దంచిత మేటికీ ప్రళయ తాండవ మల్పులమైన మాపయిన్? 5

తెలిమకరంద బిందువులు దెచ్చి, కళాపరిశీల నైకవాం
ఛలు సెలరేగ మా కొలము సాములు దీర్చిన మందిరాలలో
నిలిపి, సుఖించుచో, నర శనిగ్రహ మొక్కఁడు దాపురింపఁగాఁ
దల కొకదారి యాదుముగదా! యిది యెచ్చటి మానవత్వమో!! 6

పూవుఁ గన్నియ యెఁడద నుప్పొంగు మధుర
మధురసం బూడ్చి తెచ్చు మా మందిరములఁ
గొల్లఁ గొందురు నరులు! కాకులను గొట్టి
గ్రద్దలకు వేయుటాయె మా కష్టమెల్ల!! 7

నిజ పాండిత్యముఁ జూపి, శ్రీ కుసుమరాజ్ఞీసన్నిధానంబునన్
విజయ ప్రాభవముల్ గడింపఁగ, సుధావిత్తంబు ప్రాప్తించు మా
ప్రజ; కద్దానిని గొల్లఁ గొట్టుకొను స్వార్థప్రేరితుల్! మఱికా
ప్రజ సంహారకు; లీ నరాధముల దైవంబెట్లు మన్నించునో?" 8

పూల కోసము దూర దూరాల కేఁగి
తెచ్చు మకరందమును నరుల్ ద్రుచ్చిలింతు!
ప్రకృతి లక్షణమే హింస, సకలజీవ
పీడనములని మది సరిపెట్టుకొంటి! 9

—

# హిందూమతము

యుగ యుగార్జిత విజ్ఞాన నిగమ దృష్టి
నైహికాముష్మికములు సమన్వయించి,
సచ్చిదానంద నిర్వాణ సౌఖ్యమార్గ
గాములం జేయు మమ్మ హిందూమతంబ! 1

దుర్గ మారణ్యసీమలు దూరి, నియమ
నిష్ఠలం దేలి, ఘనతపోనేత్ర దీప్త
లలము కొన్న త్రికాలవేదులకు నైత
మెఱుఁగరానిది, నీ వయస్సెంత చెపుమ! 2

చదువున్ సంధ్యయు, సభ్యతా గరిమయున్, శాస్త్రీయవిజ్ఞాన సం
పద లాధ్యాత్మిక చింతనాపరత యొప్పన్, సర్వ సంపూర్ణవై
ముదముం గూర్చితి వంట! సోదర మతమ్ముల్ కాలగర్భమ్ములోఁ
గుదిలింపబడి పుట్టు వందుటకునై ఘోషించు కాలాననే!! 3

అమిత ప్రాజ్ఞతఁ బెద్ద లేర్పఱచినా రానాడు సంఘప్రభా
వతము నెచ్చింప నిబంధనాత్మకముగా వర్ణాశ్రమాచారమా
ర్గము లత్యంతము సౌహృదం బెసఁగ, నీ కాల్గజ్జె యల్ మ్రోసె వా
హిమవత్సేతు వసుంధరా స్థలమునన్ హిందూమ శాబ్జేక్షణా! 4

మొగమున్ బాహువు లూరుయుగ్మముఁ బదంబుల్ పుట్టినిళ్లన్నదం
తగ బాధింప దలంక్రియాత్మకముగానన్: ధర్మశాస్త్ర ప్రసం
గగతిన్ "నాస్తితు పంచమో" యనెడు వాక్యం బుండఁగా, మాలమా
దిగ లస్పృశ్యులటన్న దుర్మతము వేధించున్ జనానీకమున్! 5

అమలాచారము వెల్ల జీవరహితాపై, పావనశ్రౌతధ
ర్మము లాత్మీయవిశిష్టతం దొఱఁగెఁ; గామక్రోధలోభాలచే
సమతాబుద్ధి నశించెః మించెఁగులకతుల్ విడ్డలం; దుత్తమో
త్తమ సంస్కార మొసంగి కావఁగదె మాతా నీ తనూజాతులన్. 6

నీ విజ్ఞాన సమగ్రరూపమును వర్ణింపంగ గీర్వాణ భా
షాపై దుష్యమె సాధనం బగుటఁ దత్సంస్కారమేలేని దు
ర్భావుల్, స్వీయమతావహేళనవచఃపారీణులైనారు! త
ల్లీ! వైదేశిక భావదాస్యలత లల్లెన్ హైందవ క్షోణిపై!! 7

ప్రాభవానికి నిండు ప్రాణాలు బలియిచ్చు
రసపుత్రవీరుల రాజసంబు
పరధర్మరతి కంటబడ్డ లోఁగొనక సా
పడని మహారాష్ట్ర పౌరుషంబు
రాష్ట్రాభిమాన పరాయణత్వము పొంగ
వెలుఁగొందు వంగీయ విక్రమంబు
కోరమీసాల శృంగార వీరరసాలు
రాణించు తెలుఁగు పరాక్రమంబు
త్రిమత సిద్ధాంతముల విశదీకరించు
ద్రావిడజగ ద్విశాల మేధా బలంబు
చెఱఁగి పోకుండునట్టు లాశీర్వదించి
తాండవింపుము, హైందవ ధర్మలక్ష్మి! 8

ఏవో చిల్లర దైవతాలఁ దెఱపై నెక్కించి, పౌరాణికుల్
నీ వాఙ్మయము ఖండఖండములుగా నిల్పం గటాక్షించినా!
రీపై విధ్యకళంక మ్మూడ్చు కొనవే! యేకేశ్వరోపాసనా
భావస్ఫూర్తి ఘటించి నీసుతుల కంబా శ్రౌత మార్గమ్మునన్. 9

# గుర్వాదర్శము

ధర్మ విప్లవ బాధా విదారితములు,
మలిన విషయానుషంగముల్, మాదు చెవుల
కెంత చల్లని వార్త విన్పించి తమ్మ
[1]పత్రికా రాజమా! గుండెబరువు నడలె! 1

భారతాంబకు రత్నభండారమైన
గోలకొండ ప్రశస్తికి మేలుకొలుపు !
జీవరహిత గురుత్వ సంజీవకరణి !
యొక్క గురురత్నకాంతి తళుక్కు మనియెః ! 2

---

1. ఈ పత్రికా రాజము "Indian Express" నేటికిని వెలువడుచునే యున్నది. అసలు ప్రాథమిక విద్యాలయములకుఁ దక్కినయన్ని ప్రభుత్వ శాఖలలోని సంస్థలకంటే సెలవు దినములు మెండు. సంవత్సరమునకు శెలవులు 140 – 145 దినములుగా నుండవచ్చునను నియమముండెడిది. మిగిలిన 220 దినములు మాత్రం బడులు పనిచేయవలెను. ఈ 220 దినములతోఁగూడ ఉపాధ్యాయులకు Casual leave, Medical leave, Earned leave, అను సెలవుల వాడుకొనుట కర్హత గలదుః ఇట్టివానిని బోధకు లెవరును ఉపయోగించుకొనకుండ విడచిపెట్టరు. ఇట్టి పై సెలవులలో నొక్కపూటఁగూడ వాడుకొనకుండ మొత్తము 220 బడి నదిములు బడికి హాజరగుట కడు గొప్ప విశేషము. అట్లు తన Service మొత్తము నిర్వహించుట యూహింప రానంత విశేషం ! ఇట్టి మహా కార్యమును చేసి పూర్వఁపు నిజాము రాష్ట్రములోని యొక పాఠశాలో పాధ్యాయుఁడు మన్ననలఁ బొందెనని చాల కాలము క్రిందట "The Indian Express" అను పత్రిక ప్రకటించెను. ఏ తేదీయో గుర్తు లేదుగాని, అవిభక్త చెన్న రాష్ట్రమునకు 'గవర్నరు'గా శ్రీ 'శ్రీ ప్రకాశ్' పదవీ బాధ్యతలు స్వీకరించిన శుభ దిన మది !

46

పావన క్షేత్రములలోనఁ బడ్డ జలము
దెచ్చుకొన్నది భాగీరథీ ప్రశస్తి ! 4

తతమహోన్నత జీవితాదర్శ కవిత
చిరగురూద్యోగ శిష్య ప్రశిష్య వితతి
బహు కలా విశ్వరూప సంభావనమున
విస్మితుఁడనై తలంతు 'ధన్యోస్మి' యనుచు ! 5

——

# [1]ధన్యోస్మి

చిన్నదీపంబుఁ జేఁదాల్చి, చేరినట్టి
బిడ్డలకు వెల్గునీయ విప్పితిని నోరు;
మప్పుకొన్నారు దేదీప్యమానకాంతు;
లుల్లసిల్లుచుఁ దత్కళాద్యుతుల కిపుడు! 1

కోరి నాటితి సుఫలదాంకురము లెన్నొ
నవ్య ప్రారంభ విద్యావనమ్ము లోనఁ;
గంటి కింపైన ముక్కారు పంట నొసఁగు
భూమిజము లయ్యె, నింక నాకేమి కొదువ! 2

వావిరిం బుట్టు రతనంబు లేవొ కొన్ని
సానఁ బట్టితిఁ దొలివిద్దె లీనువేళ;
వింత రోచిస్సు లుదయించి వివిధగతులఁ
గీలుకొన్నవి, మణి కిరీటాలలోన: 3

ఆకసము నందుఁ జిఱుమబ్బునై రవంత
గురిసినాఁడను వానతుంపురులు గొన్ని

---

1. నలుబదియేండ్లు సాగిన నా విద్యా గురుత్వములో నాయొద్ద ప్రారంభ విద్య చదివి, పిమ్మట వారి వారి యవకాశములను బట్టి ఉన్నతోన్నత విద్యల కెగఁబ్రాకి నేడు వివిధ పదవులలోఁ బ్రకాశించు చున్న యానాటి విద్యార్థులను భావనాపథమున నుంచుకొని యీ శీర్షిక వ్రాయబడినది. విద్యార్థుల యున్నతికంటె నుత్తమోపాధ్యాయుని యాకాంక్ష యింకేముండును?

పాలికేంద్రకుఁ బైఁబడి, బడులలోన
బోధకత్వమ్ము నెఱపెను బో, 'రహీము';
యే ముహూర్తానఁ గాని నోరెత్తి యడిగి
పొందలేదఁట నెల వొక్కపూటయేని! 3

పూటల్ మీఱి, దినంబులం గడచి, పోఁబోఁబక్షముల్, మాసముల్
దాటున్ నేటి గురుప్రకాండులకుఁ బ్రత్యబ్దంబునన్ "లీవు!" నీ
బోటుల్ మేటి యలౌకిక ప్రకృతిచేఁ బూజ్యుల్! గురుత్వంపుటా
ర్భాటమ్ముల్ పచరించు వారలకు నారాధ్యుల్ గదా, సోదరా! 4

మానవదేహధర్మప్రకీర్తిత నిత్య
శీతోష్ణబాధానుభూతి గాని
కని, యెత్తి, పెంచఁ బ్రక్కనఁ బైనఁబడు చుండు
సంతతి ముద్దు ముచ్చటలు గాని
ఆస్తిపాస్తులకుఁ బోరాడ న్యాయస్థాన
కల్పిత వ్యవహారకాండ గాని
సంసార యాత్రలో సాహచర్యము గల్గు
చుట్టపక్కాలపైఁ జూపు గాని
నిత్యనైమిత్తికములైన నిఖిల కార్య
సంచయము లన్యములు గాని సాహసించి
గుండెఁ గుదిలించి కదప వంగుళముఁ గూడ
నెట్టి నైశ్చల్యమోయి, 'భాయీ! రహీము!' 5

చంద్రునకు నూలుపోగన్న సరణి, స్వీయ
వృత్తి గౌరవ దీక్షా వివేక శీలుఁ
డల 'రహీము'న కుచిత మర్యాద నొసఁగి
ధన్యయయ్యె, నిజాము సంస్థాన లక్ష్మి. 6

—

# అజ్ఞాత కవులు

కలవారే పదిమందికో బిరుదులుం, గట్నాలకే; మాంధ్ర భూ
స్థలి సత్కావ్యకథా, ప్రబంధ, నవలా సాహిత్య నిర్మాత లు
జ్జ్వల శిల్పుల్ గల రెందఱో, జనపదాంచ జ్జీర్ణపర్ణాలయం
బులలో; లోకము గుర్తెఱుంగని మహాత్ముల్, దైన్యపాథోనిధుల్; 1

రంగదమూల్య భావరసరంజితమై, కవితా ప్రవాహ ము
ప్పొంగి, తనంత మేలుకొలుపుల్ వచరించిన నేమిలాభ? మ
ర్థాంగ బలమ్ములం దొకటియైన రహింపక నేడు సాహితీ
రంగ మలంకరింపఁ గలరా! కవి, పండిత మాత్రవైభవుల్? 2

రాచరికంపు కంపు గనరాని ప్రజా పరిపాలనమ్ములోఁ
బూచి, కళల్ ఫలించునని పొంగెదొ! భారతియింటఁ బీఠమున్
వైచిన జాతి వర్గకుల వైర పిశాచి విశాల భావమే
తోచఁగ నీదు; సంకుచిత దుష్టభయంకర లోభదృష్టికిన్! 3

సురుచిర దృశ్యముల్ ప్రకృతి సుందరి కెందలి రాకుమోముపైఁ
దిరముగఁ జూడ్కి నిల్పి, కొని తెచ్చి, కవిత్వ సుధా స్రవంతిలో
మెఱుఁగులు దిద్ది, పాడెదుసుమీ మధురమ్ముగ! నిన్నుఁగాంచి య
బ్బురపడు వారలీ తెలుగు భూమిని లేరనకోయి సోదరా! 4

మంగలి యద్దమందువలె మాటికి మాటికిఁ బాతకాపులన్
ముంగలి కీడ్చి దెచ్చి, తృణమో, పణమో, విదిలించు "రేడియో"
రంగముఁ గూడ నీకుఁ జొరరాదె? సుదీర్ఘ లసత్తమస్వినీ
భంగ మొనర్చి, కానఁగలవా నవభారత సుప్రభాతమున్! 5

ఏ యధ్వాన్నఁపు వృత్తికో శిరము లల్లే వంచుటన్ జీవితా
ధ్యాయమ్ముల్, స్వకుటుంబ భారవహనార్థం బన్యరంగాలలో
శ్రీయోభంగముగా గతింపఁ గవితాశ్రీ యింకిపోవుంజుమీ
యీ యజ్ఞాత కళా తపస్వులకు! మేలే యీ యుదాసీనతల్? 6

లేత గులాబి సౌరభము లీల సమాశ్రయులం గరంచి, యా
పాత మనోహరమ్మయి, శుభ ప్రదమౌ కవితన్ వెలార్చుచుం
గోఁతలు గోయు విద్దియకుఁ గొండొక దూరముగా నటించు న
జ్ఞాత కవి ప్రపంచమునకై కుసుమాంజలి సంఘటించెదన్! 7

# పౌరాణికుఁడు

వాణీపీఠపుఁ జెక్కలం దెఱచి, భావస్ఫూర్తియుం, బల్కువి
న్నాణం బొప్పెడు నీతిదాయక పురాణగ్రంథముం జేర్చి, గీ
ర్వాణాంధ్ర ప్రతిభా విశేషము లెలర్పన్, ధర్మశోభాదరి
ద్రాణం బైచను మానవత్వమునఁ జైతన్యంబు సంధింపవే! 1

తనువున్, మేధయుఁ, బ్రాణపంచకమునుం 'దాకట్టు'గాఁ జేసి నే
ర్చిన విజ్ఞానము మూర్తిమంతమయి నిల్చెంగాక! నీ వాక్కులోఁ
గనరాకుండిన ధర్మసూక్ష్మములు చిక్కం బోవు శాస్త్రాలలో!
నిను గుర్తింపదు గ్రుడ్డిలోక మకటా! నిక్కంబు పౌరాణికా! 2

కుడి యెడమల్ సమత్వమునకున్ మొలిపించి, పురాణ జాలముల్
చెడు గొనరించు నంత కడుఁ జెడ్డతనం బనిపించు; స్వార్థముం
గెడపు విరక్తి, భక్తినిడి, కీడునకుం బదిరెట్లు మేలుచే
పడు నటు లాచరించు నొకపట్టున శ్రోతల చిత్తవృత్తులన్! 3

ఇహలోక సౌఖ్య నిస్పృహలో మునింగిన
వృద్ధుల కపవర్గ బుద్ధి నొసఁగి
లౌకిక విషయసల్లాప సంరంభంబుఁ
జిమ్ము నోళులకుఁ దాళమ్ము వైచి
పరధనంబు హరింపఁ బనిఁబూని చనుదెంచు
చెడు తస్కరుల చౌర్యశీల మడఁచి
పరసభ్యతకు మేను మరచు యౌవనమున
కాత్మసాక్షాత్కారమలవరించి

నయ, వినయ, భక్తిభావ తన్మయత లొప్పు
శ్రోతలకువెల్ల దివ్యానుభూతి నిత్తు !
గాన పాండిత్య, భావప్రకాశ నిబిడ
గగన భూఖండ! పౌరాణిక ప్రకాండ! ! 4

తావక గ్రంథ బంధ సందర్శనమున
మగని మొలత్రాడు, తలఁపునఁ దగిలినంత
జాలిఁగొని కంట నీరిడసాగెనంట,
నూతన వితంతు వొకతె నీ శ్రోతలందు ! 5

రాకాసి మూకల పోకిళ్ల కెఱయైన
'సీతమ్మ' కష్టాలకై తపించి
వదిన శిరోజముల్ వట్టి వస్త్రములూడ్చు
హీనునిపైన దుమ్మెత్తిపోసి
బోటులకుం గన్నుగీటి వేణువు నూదు
బాలకృష్ణుని ప్రేమలీల లరసి
పతిత మానవసేవ పరమార్థ మని తెల్పు
గౌతమ బుద్ధుని గాథ లెఱిఁగి
వివిధ మానసికావేశ విలసనముల
కగ్గమై, జన్మసార్థక్యమందు నట్లు
సంస్కృతి పథాన నమృతంపు జల్లువోని
సతత సద్గోష్ఠి నిత్తు పండితవరేణ్యా! 6

—

# ముందడుగు

సకల దిగ్దేశ రాజన్య సేవితమైన
సార్వభౌమత్వమే జాడఁ బోయె!
భవ్య పరబ్రహ్మవస్తు నిరూపణా
ఖండ విజ్ఞానమే కడకు నరిగె!
శత్రు సంహార దోస్సార భాసుర సువి
శాల శౌర్యాగ్నియే మూలడాగెఁ!
బరమాత్ముఁదక్కఁ దొక్కరు వేడఁబోవని
స్వేచ్ఛానురాగ మేచెంత కేఁగె!

కటకటా! యనివార్యమౌ కాలనియతి
సర్వశక్తులు గోల్పోవ స్వార్థమొకటె
నిలిచి యున్నది నీలోన; జలము లింక
మిగిలిపోయెడు పంకంబు పగిది నేఁడు!

1

రాజనీతిజ్ఞులై తేజరిల్లిన పూర్వ
దండనాధుల నెంత దలఁచుకొన్న,
రణరంగముఁ గవోష్ణరక్తధారల నించు
ఱేండ్ల శౌర్యము విచారించుకొన్న,
అసమాన మానధనాగ్రపూజితులైన
రాజపుత్రుల పరాక్రమము విన్న,
పరదేశములఁ జేతఁబట్టి పాలించిన
పూర్వ సామ్రాట్టుల పొలుపు విన్న,

తనువు పులకించి, వాడివత్తలయియున్న
జీవనాడుల కొక్కింత చేవగలిగి
భావదాస్యంబు విడిపోదె? భారతీయ
కార్యశూరుఁడ వీఁవైనఁ గమ్ము, లెమ్ము! 2

కులభేద తత్వమావలకుఁ ద్రోయకయున్న,
బుద్ధిమాంద్యము కూలిపోకయున్న,
హిందూ ముసల్మాను లేకంబు గాకున్న,
జాతి వైషమ్యముల్ చావకున్న,
పూర్వ దుష్టాచారములు మార్చుకొనకున్న,
వెలిసీమలన్ దృష్టిఁ బఱపకున్న,
దేశభక్తుల మొఱల్ దీక్షతో వినకున్న,
శూరతఁ గ్రియలలోఁ జూపకున్న,

పూర్వ సౌభాగ్యమును మనంబునఁ దలంచి
యట్టి వెలుఁగునకై ప్రాకులాడకున్న,
విశ్వమానవ కళ్యాణ వీధియందు
నడుగు వేయుటకే యనర్హుఁడవు గావె? 3

# సాహితీ స్వేచ్ఛ

పిన్నల్ పెద్దతలల్ ప్రజా కవితపైఁ బ్రీతిం గళా దృష్టికే
సున్నా చుట్టిరి! కట్టుబాట్లు వలదంచున్! రాజకీయాలలో
నెన్నో పక్షము లుద్భవించినటు, సాహిత్యమ్మునన్ దారియుం
దెన్నుం గానని వింతమార్గముల కంతేలేదు! వాగీశ్వరీ! 1

"నాది ప్రజా కవిత్వ" మనినాఁ డొక మిత్రుఁడు బల్లగుద్ది! యా
మాదిరిఁ జూపుమంచు బ్రతిమాలినపై, వినిపించె శాస్త్ర మ
ర్యాద నతిక్రమించి యొక యాఁకలి దప్పుల నగ్నదృశ్యమున్
గీదర బాదరా నుడుల గిల్కిన కొన్ని విషాద గేయముల్! 2

నన్నయలోని సాంస్కృతిక నైపుణి, తిక్కన తెల్గు సొంపు, పె
ద్దన్న శిరీషకోమల పదార్థ మనోజ్ఞత, చేమకూరి వెం
కన్న రసోక్తి వైఖరులు, కాసునకుం గొఱగావు! నేటియ
ధ్వాన్న విచిత్ర గేయకవితాసవపాన వినోద వాదికిన్!! 3

స్వార్థ మురొప్పంగ నవకాళవాదియైన
కవి కుమారుని పగలింటి కలయె గాక!
ఎయ్యది ప్రజా కవిత్వమో? యేది కాదో?
నిర్ణయింపంగఁ జాలు మనీషి గలఁడె! 4

నన్నయ శాసనంబు లధునాతనులన్ మురిపింపవంచు, నే
గిన్నయ భట్టులో యిప్పుడు గిల్కిన గీతలలో మెలంగి, య
ధ్వాన్నఁపు దుర్దశం బడకు మమ్మ! కళా పరమార్థ దృష్టి సం
పన్నతలేని వర్తన మపాయ కరమ్మగు నమ్మ భారతీ! 5

లతలుం, బూవులుఁదేనె వాకలుఁ, బికాలాపమ్ములున్, మంద మా
రుతముల్ జేర్చి నవీనులౌ కవికుమారుల్ వాడు గీతాలలో
నతుకుల్ గూర్చిన కొంత కైవడిఁ దయారయ్యెం గవిత్వమ్ము! దు
ర్గతియో, సద్గతియౌనొ భారతికిఁ గాలమ్మే నిరూపించెడిన్! 6

అకలంకమ్మగు గ్రాంథికమ్మొకడె, సర్వాంగీ కృతంబైన కా
వ్యకలాపమ్ముల దిద్ది తీర్పఁగల; దాయాచోటులన్ వ్యావహా
రిక మే యక్కరలేదు! చూడుఁ డనుచున్ దృష్టాంతముల్ పానుగం
టికు లుండా నరసింహరాయకవి చాటించెం బ్రజాకోటికిన్! 7

వ్యవసాయమ్మునకై జలం బిడఁ, బ్రభుత్వమ్మొల్లెడన్, మేటి కా
లువలం ద్రవ్వుచు గట్లు వై చిరిగదా; లోభమ్మునం జేని పా
టవముం గోరి కృషీవలుం డొకట గండ్లం గొట్టినన్ సైతు రే
భువి నుద్యోగులు? సాహితీ జలధులీ పుణ్యానికిన్ నోచవే! 8

పట్ట పరీక్షలో శతక పద్యములే గతి! సాహితీ సభన్
గిట్టిన రీతి గల్కికొను గేయములే గతి! పాటగాంప్రడలో
జెట్టుల కేనియుం జలనచిత్రములే గతి! యీ వికారఁపున్
ఘట్టము దాపురించినది గావలె నన్న తలంపు గల్గెడిన్! 9

కవిత స్వచ్ఛందగతి వింతగాఁ జరింపఁ
గావ్యవస్తువు లెన్నియో కానుపింప
నచ్చు యంత్రాల సాహిత్య మతిశయింప
నెల్లరు కవీంద్రులే! భాష కేమి కొదువ! 10

ఔచిత్యలతకు సమ్యగ్దోహదముతైన
కవి సాంప్రదాయాలఁ గాలఁదన్ని!
శబ్ద సాధుత్వంబుఁ జాటించు వ్యాకృతి
పాటవం బొకట నట్టేటఁ గలిపి!

చెవి కింపు నింపు సుస్థిరగతుల్ సమకూర్చు
ఛందోలతాంగి మస్తకముఁ ద్రుంచి!
రసిక పండితుల మానసము లాకర్షింపఁ
దగిన యలంకృతుల్ తస్కరించి!

మేటి సువ్యక్త భావాలు మెదిపి మెదిపి
నవ్యరీతుల పేర శూన్యమునఁ జేర్చు
వెట్టి పోకడలెల్లఁ గవిత్వమేనిఁ
గవిత గానిది యింక లోకమునఁ గలదె! !

11

—

# పండుగలు

జాతీయోద్యమ భార నిర్వహణ దీక్షాదక్షులై లోక వి
ఖ్యాతిం గాంచిన నాయకాగ్రణుల త్యాగస్ఫూర్తి దీపించు సు
జ్యోతుల్ భారతజాతి పర్వదినముల్, చోద్యాలతో, పద్రసో
పేతాన్నంబులతో, మఱుంగువడు టొప్పే? సుంత యోజింపుఁడీ! 1

చేదు మాహాత్మ్యంబుఁ జెప్పి, లోకఁపుఁదీరు
వర్ణింపఁజాలు 'సంవత్సరాది !'
కోటల కెగఁబ్రాకు పాటవమ్మే నొసంగు
ఘనమైన 'నంద నందన జయంతి !'
బాణ, బాణాసన ప్రౌఢి భాగ్యము నందె
వేడ్కమై బోధించు 'విజయదశమి !'
మన కుటీర పరిశ్రమ ప్రదర్శనమున
రాణించు 'మకర సంక్రాంతి దినము !'

మొదలుగాఁగల పండుగల్ విదితమైన
సాంప్రదాయాలతో వెన్నుఁజఱచు చుండ
జాతి సౌభాగ్యమును జెంపుసేత మాని
పొట్టకై దేవులాట యిదెట్టు లొప్పె? 2

'దసరా' పాటలు నాల్గు నేర్చుకొని చందా పట్టికం బాముగా
బుసఁగొట్టింపఁగ, గేస్తులెల్లరును రేపున్ మాపు రప్పింపఁగా
విసువుంజెందు గురుండు పండుగలలో వెల్గొందు వైజ్ఞానికో
ల్లసనంబుం గమనింపఁబోవఁ! డిదిమేలా జాతికిన్ నీతికిన్ ? 3

ఏమని చెప్పుదున్ దశరథేశ్వరు మాటనెపాన, లోక ర
క్షామహనీయ దీక్ష నను జన్మనితో, సతితోడఁ, గానన
స్తోమము మెట్టు పూర్ణపురుషుం దలఁపించు పవిత్రమైన 'శ్రీ
రామ జయంతి' పానకముఁ ద్రావుటకే యను వింతవాదమున్! 4

అల వైశాఖ నవోదయమ్మున నృసింహస్వామి సేవా సుశీ
తలతాపాదక వస్తు దానము, వసంత క్రీడ, లుండ్రాళ్ళ త
ద్దెలు నారోగ్య విధాన రక్షకము లంతే: వెర్రి యాచారముల్
చెలరేగెం బరమార్థ శూన్యములు! నిర్జీవాస్థి బంధమ్ములై! 5

ఆర్యద్రావిడ ధర్మభేదములతో నాయా మహా నాయకుల్
ధైర్యం బొప్పఁగఁ బోరి, ప్రాణముల నైతం బిచ్చినా; రామహా
చర్యల్ పర్వము లయ్యె నెల్లరకుఁ; దజ్జాతీయతా భావ మా
ధుర్యంబుల్ గనరావు నేఁడు మనకెందు, బంచ భక్ష్యాలలో! 6

బూజుల్పట్టు పురాణ పర్వదినముల్ పోనిమ్ము! నేడెంతయో
మోజుం గూర్చు స్వతంత్రభారత దినమ్మం, దచ్చరిత్రమ్ము ని
ర్వ్యాజ త్యాగ విభూతి చిహ్నముగుఁ గాదా? పండుగై పోయెనే
'జై జై'లం గురిపించి, మందిరముపై జెండా ప్రతిష్ఠింపఁగన్! 7

—

# "పానుగంటి"

ఆనఘాంధ్రోక్తి మయ ప్రపంచమునఁ 'కాలాచార్యు', 'జంఘాలశాస్త్రి'ని, 'బొర్రయ్య'ను, 'వాణిదాసకవి' 'సాక్షి'న్, భిన్న భిన్న స్వభావ నిరూఢాఖిల ధర్మ సంయుత కలాప్రావీణ్యులన్, సృష్టిఁ జేసిన నీ కియ్యవె 'పానుగంటి' పరమేష్ఠీ! నా నమోవాకముల్. 1

'వ్యవహారభాషా' వివాదమ్ము లను పేరి
యభిసారికల గుండె లవియఁ జేసి!
పాశ్చాత్త్యమత వేష భాషానుకరణ ప్ర
చారాంధకారమ్ముఁ బాఱఁద్రోలి!
ఆర్ష విజ్ఞాన గూఢార్థ ప్రకాశ కో
దార వాక్పీయూష ధార లొలికి!
సకల సాంఘిక దురాచార చోర స్వైర
సంచారములనెల్ల సమయఁజేసి!
పూత విఖ్యాత 'పీఠికాపుర' మహీశ
సూర్యరాయ సహాయ విశుద్ధ శక్తి
నాంధ్రజాతికి సమధి కాహ్లాద మొసఁగె
సరస 'పాన్గంటి' సాహిత్య చంద్రదీప్తి! ! 2

ఆంధ్రపత్రికా సారస్వతానుబంధ
నవ నవోన్మేష సాక్ష్యుపన్యాస మధుర
మధురసా స్వాదనమునకై మందవార
మెదురు చూడని తెలుఁగుఁడెవఁడు నాఁడు ? 3

అదె యుదయించె మున్నొక శతాబ్దికిఁ బూర్వమె తెల్గు భూమిలో
రొద విని 'పీఠికాపుర' సరోవర మందొక తమ్మిమొగ్గ! య
య్యది వికసించి మెల్లన సహస్ర దళమ్ములు విప్పి, యాంధ్రి కిం
పొదవెడు పాదపీఠమన నొప్పె విశిష్ట పరిమళమ్ములన్! 4

నెరవేరె నొక్కొ 'వాణీదాస' 'కంకణ
బంధ' నానార్థ కావ్య శ్రమమ్ము?
కలఁగాంచు నొక్కొ 'జంఘాలుం' డుపన్యాస
వేదిక లొమ్ములు బాదుకొనఁగ?
బృందారక శ్రేణి 'చందా' లొసంగునే
నాటి 'కాలాచార్య' నశ్యనిధికి?
మందాకినీ జలమ్మందు నిత్తడి చేయిఁ
బులికా పొనర్చునే బొట్టుసెట్టి?

అమరనాథుని కిరుగడలందు నీవు,
సూర్యరాయ ప్రభుండును పొంపు గుల్క
గురుఁడు, దిక్పాలకులు మెచ్చుకొనఁగ 'సాతీ
సంఘ' కార్యక్రమమ్ములు సాగునొక్కొ? 5

సిద్ధంబై, రసకందమై, సుగుణరాశీభూతమై, వ్యాకృతీ
బద్ధంబైన తెనుంగు బాసను పడల్పం జూచు నవ్వారిపై
యుద్ధంబున్ ప్రకటించి, శాత్రవ వచోవ్యూహమ్ము భేదించు నీ
బుద్ధి ప్రాభవమున్ వచింపఁగలరే భోగీశ, వాగీశులున్? 6

కల, యున్మత్తత, మంత్రదండములుగాఁ గన్పట్టు నీచేతి యం
దలఘు ప్రజ్ఞ వెలార్చి, యాద్వయముచే నత్యంత విజ్ఞాన స
త్ఫల గంభీరవచో విలాస కవితోపన్యాస సౌగంధ్య పే
శల మాధుర్యము లొల్కఁజేసితి, రసజ్ఞప్రీతి సంధిల్లఁగన్! 7

అవిమృశ్యమ్మగు చిన్ని పొత్తము "విమర్శాదర్శ" యన్నట్టి దా
రవితారమ్ముగ నిల్వ నానపడి 'బుర్రాశేషగిర్యాఖ్యుఁ'డా
ర్జవ మొప్పన్ వెలయింప, దానిని భవత్సంఘంబు చెండాడెఁ; ద
'చ్ఛవ పంచాయతి' మేటి భూషణముగాదా? వాఙ్మయక్షోణికిన్! 8

ఆనతరాజమౌళి మకుటాంచితపాద సలక్షణాంధ్ర భా
షా నవకోమలాంగిని బజారున కీడ్చెడు గ్రామ్యవాద ఝం
ఝానిలమున్ మరల్చిన కులాచల కల్పుఁడు, పానుగంటి ల
క్ష్మీనరసింహరాయ కవి సింహున కియ్యవె మత్సుమాంజలుల్! 9

——

# [1]"పద్మశ్రీ" స్థానం

నీ నయగారఁపుం గులుకు నీటు - అఖిలాంధ్ర రసజ్ఞ మండలీ
మానిత మయ్యెఁబో! నటకమండన! పై నది భారతోన్నత
స్థాన మలంకరించు టొక సాకుగఁ గైకొను మీ సుమాంజలిన్
స్థానము వంశవారిధి శశాంక! విరంకుశ సత్కళానిధీ! 1

చిన నాడే మహనీయ మూర్తి మహా దాశీర్వాదముల్ పొకెనో
నినుఁ; గాకున్నఁ గళాభిమానమిటులౌనే! సాధనాపర్యుపా
సనచే నంకురమై, వెసందరుణ వృత్తమైమ్రె, నిజచ్ఛాయలం
దన జాతిం దనియించి, నోచుకొనె "పద్మశ్రీ" ఫలప్రాప్తికిన్! 2

పెదవులపై దరస్మితము పెంపును, గన్గవ వాలుచూపుతోఁ
బదిల మొనర్చుచుం, బ్రణయ భావపరంపర చెంగలింపఁ బ
య్యెద మెదలించితేని, నరుఁడే యననేటికి? దేవదేవుఁడే
కదలి, త్వదీయ పాదముల కట్టెదుటం బ్రణమిల్లకుండునే! 3

వేసము నందు, వాచ్యమున వైరితలల్ గనుపింప; వన్యమౌ
దోసము వీసమున్ మదికిఁ దోపదు; పండిత పామరాళి కు
ల్లాస మొసంగు భావకవిలాసము; నాట్యకళానుభూతి నీ
వేసరి నీకు! విట్టువలపింతువు కాంతలనేనిఁ గాంతవై! 4

---

1. భారత రాష్ట్రపతిచే "పద్మశ్రీ" బిరుద మొసంగఁబడిన 'నటకావతంస' శ్రీ స్థానం నరసింహారావుగారి నభినందించుటకై, గుంటూరు లోని "ఆంధ్రసంసత్" వారేర్పాటు జేసిన సభలోఁ జదువఁబడినవి.

పూర్వఁపుం బుట్టువుల నెంతొ పూలతోడ
నక్షతలతోడఁ బూజించి యనుదినమ్ము
భరతముని యొద్ద శిష్యత నెఱపకున్న
నిట్టి నటనానుభూతి నీకెట్టు లబ్బె? 5

భారతాంబా ప్రసాద సంభావనమున
శిరమునందాల్తు గాక; యీ చిన్ని బిరుదు
శతసహస్ర పద్మశ్రీ ప్రసన్న మధుర
మానినీ వేషధారి కే మంత గొప్ప! 6

శృంగార రసము ముంగొంగు బంగారమై
తేజరిల్లిన వేశ్య 'దేవదేవి!'
శత్రు మారణహోమ శపథమ్ము నెఱవేర్పఁ
గొడుకు నుద్బోధింపఁ గోరిన 'ముర'
అలభవానీ భక్తుఁడగు 'శివాజీ' మనో
రుజ కాకరమైన 'రోషనార'
డాకాలితన్నిన లోకైకనాథుఁ బె
ల్లుడికింపఁ బూనిన దుడుకు 'సత్య'

పూర్వచాళుక్య నృపతికి బుద్ధిసెప్పి
పొంగిపోయిన 'చిత్రాంగి' నంగనాచి
తెలుఁగు టెడదల నుండి వైదొలఁగ కుండ
నానఁబెట్టితి వోయి, నటావతంస! 7

# కష్ట సుఖములు

కిరణపంక్తి వెంటఁ గ్రీనీడవలె మేటి
సుఖము లెల్లఁగష్ట సూచకములె!
కష్ట సాగరంపు దుష్ట తరంగాల
నడిమి గతియె సుఖము నాఁదనర్చు! 1

ప్రకృతి మాతకు దూరమై భక్ష్యభోజ్య
లేహ్య, పానీయములలోన లేశమేనిఁ
గ్రమతఁ బాటింపఁబోని సంఘమున నేటి
కష్టసుఖములు నైసర్గికమ్ములౌనె? 2

నవ వైవాహికశోభనోల్లసిత కన్యారూప లావణ్య వై
భవ సందీపిత చాతురీ ఘనవచఃప్రాగల్భ్య నిర్మగ్నమా
త్మవరానీక సమాశ్రితమ్మగు విమానమ్మెడనో సాగరాం
బువులం గూలు విషాద ఘట్టములు దెల్పున్ జీవితాంతర్యమున్! 3

రమణీయ నవ పాదరక్షాసుఖము నంటి
యుండునేగద కాలింపుండు బాధ!
షడ్రసోపేత భోజన లౌల్యమున నంటి
కుదిలించుగద జీర్ణకోశబాధ!
ఆకాశ, జలధి ప్రయాణ సౌఖ్యము నంటి
వెరపించుఁగద సంఘమరణ బాధ!
క్షణికమౌ ప్రణయ సౌఖ్యము నంటి వెనువెంటఁ
జనుఁగద ఘోర సంసార బాధ!

అనుభవించిన కష్టమ్ము లణఁగి, మరల
నుగ్రతరమౌ విపత్తు రానున్న వేళ
నేమి చిత్రిమొ సర్వమ్ము నిల్చె మఱచి
కులుకుచుండు రభాగ్య జీవులు ధరిత్రి! 4

నైతికాధ్యాత్మికాది చింతనము చచ్చె!
నవ్యభౌతిక దృష్టికోణమ్ము హెచ్చె!
వికట దుస్స్వార్థ భావకోరకము విచ్చె!
నఖిల మానవ లోకపుణ్యమ్ము పుచ్చె! 5

— —

# సంఘశక్తి

అణఁగి, కృశియించి, నిర్జీవమైన దేశ
జనని సౌభాగ్యమున కేది చంప పెట్టొ
వీను లలయంగ గతచరిత్రానుభవము
విప్పి చెప్పదె మనకెల్ల వేయినోళ్ళ! 1

కలియుగాన సంఘబలము లేని యభాగ్య
జీవిరక్తమునకుఁ జేవ లేదు!
పదుగు రొక్కటైన బ్రహ్మాండ చక్రమే
త్రిప్పఁ గలరు వెంగళప్ప లేని!! 2

కులగోత్రాల కతీతమౌ మమత పొంగుల్ వార, లోలోన ని
స్తుల బాంధవ్యము, సౌహృద మ్మెసంగ నెంతో ప్రేమతో నన్నద
మ్ముల వావుల్ పచరించి, జీవిత సుఖమ్ముల్ గుత్తగాఁ గొన్నవా
రలు పూర్వుల్, నవ సభ్యతాగరిమలో రాణింపవా యోగ్యతల్! 3

పదుగు రొకని కొఱకు, పదుగుర కొఱకొక్కఁ
డన్న సంఘ జీవితాశయమ్ము
వెన్నతోడఁ బెట్టు విద్యగాఁ దొల్లిటి
గ్రామసీమ స్వర్గ ధామమయ్యె! 4

మతవర్గకలహ దుర్మార్గ ప్రసక్తులఁ
గాంచించు బాలులపైఁ గాలువెట్టి!
ప్రజలరక్తముఁ ద్రావి బలియు రాచకరింపు
కీలు బొమ్మలకు గోరిలు గట్టి!

దేవ, భూదేవతా ధీనతఁ గుందు మా
        న్యాలకు దాస్యబంధాలు నెట్టి!
అసహాయు లన్నఁ బెల్లార్చి విజృంభించు
        హోదాల వారి పళ్యూడఁ గొట్టి!

సుప్రజారాజ్య మహాదాశయ పరిపూర్ణ
నవ్యభారత ఘన 'జగన్నాథ రథము'
తరలినది! గమ్యముం జేరుదాఁక దీక్ష
సడల నీయకు జాతీయ సంఘశక్తి!!        5

— —

# సందేహము

నీ ప్రసాదంబు గాని దీనిఖిల జగతి
నేమియును గూడ లేదను టెఱిఁగి, నరుడు
గుడికి వేంచేసియట వర్చకుం గొసంగు
చిత్ర దధ్యోదనముల కాశింపనేల? 1

ప్రకృతి రూపుండ వీవు; నీ పరమతత్త్వ
మిమిడి యుందని పరమాణువేని లేదు!
అట్టిచో మానవుండు దేవాలాయమునఁ
గాలిడిన యంత భక్తాగ్రగణ్యుఁ డగునె? 2

సాకారార్చన ముండితీరవలె నన్సత్యమ్ము ముమ్మాటి కం
గీకార్యమ్మగు; మానసమ్మిచటనే గీల్కొల్పి, పైమెట్టుకుం
బ్రాకం జాలని నాడు, జీవితము సర్వమ్మట్టులే వ్యర్థమౌ
గాకెన్నందు నరుండు నేర్చెడి నిరాకారార్చనా ప్రక్రియల్? 3

— —

# ఆంధ్ర కేసరి

బ్రాహ్మణవంశ సంభవుఁడన్న నుడి కేమి
నిఖిల మానవసేవ నీ మతంబు
అల 'కనువర్తి' నీ యభిజనంబననేమి
యఖిలాంధ్ర జగతి నీ కాలయంబు
పలుమారు లిట మంత్రిపదవు లందుటకేమి
నిస్తుల త్యాగంబు నీ పథంబు
కాంగ్రెసు సభ్యత్వ గౌరవంబున కేమి
సర్వోదయాప్తి నీ చరమలక్ష్య
మాంధ్ర కేసరి బిరుదమ్మునంద నేమి
భారతీయ ప్రకాశావతార మీవు
పాంచభౌతిక కాయమ్ముఁ బాయ నేమి
నిరుపమము, శాశ్వతమ్మగు నీ యశస్సు! 1

ఉత్సాహ, ప్రభు, మంత్ర, శక్తులకు నా యుర్ధాయముం బోసి, సం
పత్సాంగత్యము రోసి, త్యాగనిరతిం బాఠాలు బోధింపఁగా
నౌత్సుక్యమ్ము వెలార్చు నాయకుఁడు మా కన్యుండు లేడంచు, నీ
యుత్సంగమ్మున భద్రముల్ గనినపుణ్యుల్, యావదాంధ్ర ప్రజల్! 2

క్రమముఁ దప్పిన పాశ్చాత్యదమన నీతి
నిండు ప్రాణాలు బలిగొనుచుండఁ జూచి
కనక మీనెడు వృత్తినిఁ గాలదన్ని
మీఁదఁ బడవైచు కొన్నావు, బీదతనము! 3

'సైమను' తుపాకులకు గుండె 'జఱచి' నిలిచి
'రండు రం' డంచు సింహగర్జన మొనర్పఁ
గ్రిక్కిరిసి యున్న 'తిరువళిక్కేణి'ఁ ప్రజలు
మురిసిపోవరె 'వీరకేసరి' వటంచు! 4

# [1]జిజ్ఞాస

పాడిన పాటగా జనులు పాలసముద్రమునందు లచ్చితోఁ
గూడ జనించినావనుచు కొందఱు, కొందఱో యత్రిమౌనికిం
బోడిమి మీఱఁ బుత్రునిగఁ బుట్టితి వంచు, వచించుచుందు రీ
నాడవి కల్లలే యయిన, నమ్మెక మున్నె పురాణగాథలన్? 1

అవిరళ సౌఖ్యముం బడయనై దువలా సతులింక భక్తి గౌ
రవములతోడ, షోడశ కళా వరిపూర్ణుని నిన్నుఁ గొల్తురే!
ప్రవిమల మూర్తి వైన నెలబాలుని కియ్యదె నూలు పోగటం
చెవఁడు జడస్వరూపునికి నిచ్చుటఁ దలంపఁగ భీతిగల్గెడున్? 2

ఆహరహమున్ ధరాతలము నందలి జీవుల భాగ్యరేఖలన్
సహనముతో వెలార్చెదు ప్రచండ మహామహిమాఢ్యులౌ నవ
గ్రహములలోన నొక్కఁడవుగాఁ దలపోసెడి భక్తకోటికే
మి హితముఁగూర్ప నీ కగునోః మింటఁ జరించు జడస్వరూపికిన్! 3

కలువల ఱేఁడు, దైవతము కాముక సంతతికిం, జకోరపుం
బులుఁగుల కన్నదాత. విడిపోయిన ప్రేమికులన్ దహించు నిం
గల మని యెన్ని యోగతులఁ గావ్యకవుల్ వినుతించి; రిట్టి యు
జ్జ్వల మధురాను భూతులకు 'స్వస్తి' వచింపు మటందువా, శశీః 4

---

1. చంద్రమండలోపరితలమున నమెరికా యంతరిక్ష యాత్రికులు కాలుమోపిన యుదంతము వార్తాపత్రికలలోఁ జదివిన నాడు హిందూ మతాచారానురక్తులగు స్త్రీ పురుషుల హృదయములలోఁ గలుగు భావ పరంపర కిది కవితా రూపము. ఈ పద్యములు లిదేశీర్షికతో నప్పుడే 'ఆంధ్రప్రభ' దిన పత్రికలోఁ బ్రకటింపఁబడినవి.

ఎదఁ గళంకంబు గల దంచు, నింతు లందు
సమత లేదంచు, గురుతల్పగమనుఁ డంచు,
శివుని తల కెక్కనం చింకఁ జెప్పఁబోరు!
గొప్పయుండిన నిందలు గూడఁబాయు!! 5

జ్ఞానమొ, మౌఢ్యమో, యుగ యుగంబుల నుండియు, భారతార్ష వి
జ్ఞాన వికాస వీథులఁ బచారొనరించుచు, సర్వదేవతా
నూన మహత్వశాలిగ, నినున్ భజియింతుము 'మామ' వంచు! మా
మానవ పాదఘాతమున మంటలు రేగిన వేమొ నీ హృదిన్!! 6

అవురా! యెంతటి విప్లవమ్మిది! పురాణా ధ్యాత్మిక జ్ఞాన సం
భవ దివ్యా మృత భావసంచయము వమ్మైపోవునా, భౌతిక
స్థవిర జ్ఞానము ముందు? నిప్పు డయినన్ జాబిల్లి; నీ స్వస్వరూ
ప వివేకమ్ము నొసంగి, సందియముఁ దీర్పన్ రాదె, మా బోంట్లకున్! 7

—

# మన రాజధాని

తెలుఁగుఁబల్కుఁగలకల్కి దివ్యప్రబంధ బం
ధురయయ్యె 'విద్యానగరము' నందు!
తెలుఁగుఁ గైతలు 'స్వస్తి' పలికె రాజుల
వైరకాలుష్యముల 'కోరుగంటి' యందు!
తెలుఁగు భాషారుచుల్ తెలిసికొన్నది ప్రజా
వాణి 'రాజమహేంద్ర వరము' నందు!
తెలుఁగు శబ్దాల పొందికలు మారోగ్రిగెను
గగన సీమల 'ధాన్యకటక' మందు!
తెలుఁగు రాచటీకములు వర్తిలిన చోట్ల
రేగి, పొలు పారె భాషా పరిమళములు!
నవయుగాంధ్రప్రదేశంపు నవ్య రాజ
ధాని మన భాగ్యనగరంపు దశ యిదేమొ!। 1

శతముల్ వత్సరముల్ నిరంతర "మసఫ్ జాహీ" కులోద్భూతభూ
పతులే రాచటీకమ్ము సేయునెడఁ దప్పిం బోదు తత్సంస్కృతీ
ప్రతిబింబత్వము! నేడు స్వీయమగు రాష్ట్రమ్మేర్పడం బూర్వదు
ర్గతియే నిల్చుట శోచనీయము గదా, రాష్ట్ర ప్రజాకోటికిన్। 2

పోడిమి, లావు! జేవయును బోంకముఁ గల్గిన దేవభాష చేఁ
దోడుగ, మాధురీమహిమతో వెలుగొందు తెలుంగు హంగులం
బాడును, గోడుఁజేసి, పెరబాసల కంకితమైన వారతే
యేడను గానరయ్యెడి! యిదెక్కడి యాంధ్రుల రాజధానియో!। 3

పేటకులం, జతుపృథ పవిత్రతలమ్ములకున్ ' బజార్లకున్'
నాటికి నేటికిం గలుగు నామములంగన, స్వీయ సంస్కృతీ
పాటవ మింతయేనిఁ గనుపట్టదు నూటికిఁ దొంబదింటః యీ
మాటలు పోటు లాగద, సమగ్ర సురూప భవిష్యదాంధ్రికిన్ః 4

కాఁకల్ దీరిన సోదరాంధ్రులు తెలంగాణా నివాస ప్రజా
నీకం బైనను, దోడి మిత్రజన సాన్నిధ్యమ్మునందెల్లు భా
షా కౌశల్యముఁ జూప; రిచ్చటికి సంచారార్థులౌవార లే
పాకిస్థానము లోన నున్నటులనో భావించినన్ దోసమే! 5

తెలుఁగుం గట్టును, జుట్టు, బొట్టుఁ, బలుకుం దీయందనమ్మొప్ప వా
రలు గన్పించిన, జీవనాడి గమిలో రక్తమ్ము తీవ్రమ్ముగాఁ
జలియింపన్, మమతానురూప హృదయస్పందమ్ము రేకెత్తుః నా
వలఁ బూర్వానుభవమ్మె వెండియు, మనోవాక్కాయ కర్మమ్ములన్!!6

ప్రీతియై మద్రాసు, బెంగుళూరులలోన
తమిళ, కన్నడములు తాండవించు
చెంత నొప్పెడి 'తిర్వనంత పురమ్ము'లో
మళయాళ మెల్లెడ మారుమ్రోగు
ఉత్తరమ్మునఁ 'గలకత్తా' పురమ్ములో
వంగభాషాసతి హంగు సేయుఁ
బొంత లక్నో నాగపూరు పాట్నాలలో
హిందీ సరస్వతి చిందులాడు
స్వీయ భాషాధిపత్యమ్ముఁ జెందకున్న
మనపురమ్మెట్లు సోదరీమణులలోనఁ
జెలువు మీఱఁగఁ దలయెత్తి నిలువఁ గలదొ
యుంత యోజింపఁరే, ఆంధ్ర సోదరాళి! 7

తక్కు రాష్ట్ర రాజధాను లందింతటి
సంస్కృతీ విహీన సరణి గలదె?
నాల్గుకోట్ల జనుల వందనసీమగాఁ
దెలుఁగు రాజధాని వెలయుఁ గాక! 8

———

# బుద్ధుఁడు

పుట్టిన దాదిగఁ గష్టపు
చుట్టఱికము లేకయుండ శుద్ధోదనుఁడె
ట్టెట్టో కట్టడఁ జేసిన
గుట్టుబైటఁ బడియెఁ బ్రకృతి గుణములు దెలిసెన్। 1

బలము చాలక నేలఁబడి నాలుకలు జాచు
బక్కయెద్దుల కూలిపాటుఁ జూచి
పొట్టపైఁ దాబేలుఁ బోలెఁ బ్రాకుచుఁబోవు
నంగహీనుల యంగలార్పుఁ జూచి
బలవంతు లమిత దుర్బలుల పీకలు నొక్కు
జాలి నూరించు దృశ్యాలఁ జూచి
మృత్యుదేవత పిల్పుమీఁద సవార్లపై
వల్లకాడేఁగు శవాలఁ జూచి

అంతరంగానఁ గరుణా స్రవంతి పొంగి
సర్వసంగ పరిత్యాగశక్తి నొసఁగఁ
బరమ సత్యస్వరూపంబు నరయు కొఱకుఁ
బయన మైతివె, శాక్యభూపాల తనయ। 2

రక్త పిపాసువుల్, భయద రాక్షసజన్ము లనంతరూపులై
భక్తులవోలె నల్గడలఁ బావన భారతభూమి రక్తసం
సిక్త మొనర్పువేళఁ గురిసెన్ భవదీయవచో ఘనా ఘన
వ్యక్తదయా సుధామధుర ధారలు లోకముదావహమ్ముగన్। 3

అలనిశావేళ నీదు మహా ప్రయాణ
మర్మమూహింపఁ బోలు! హిమచ్ఛలమునఁ
'గపిలవస్తుపుర' ప్రాంత కాననములఁ
దరు లతావళి బాష్పసంతతులు రాల్చె! 4

నాస్తికుఁ డంద్రు నిన్ను సుగుణాంచిత! తావక హేతువాద శీ
లాస్త మితప్రగల్భులగు నట్టి మహా మహులున్, పురాణ వి
ధ్వస్తలు! వీరి యాస్తిక విధాన పరస్పర భిన్న దృష్టులే
నిస్తుల ముక్తిసాధన మనీషకు దూరముగాఁ గనంబడున్! 5

రాజ్యకాంక్షా ప్రభూత దుర్వార రుధిర
దాహ సంపీడ్యమాన దుర్వ్యూహములకు
సొమ్మసిల్లెడు మానవత్వమ్ము! మరల
నుద్ధరింపంగ రాగదే బుద్ధదేవ! 6

# వార్షికోత్సవ ప్రశంస[1]

కడికండల్ స్వకుటుంబ భారమున గ్రుగ్గన్, సేవకా వృత్తిలోఁ
బడి, కూపస్థిత మండూకమ్ముల క్రియన్ వర్తించు మాబోంట్ల కె
క్కడి సారస్వత సేవ యంచనక, యిక్కార్యంబుఁ జేపట్టినా
ముడుతల్ సాగరబంధనమ్మునకు మున్నుత్సాహ పడ్డట్లుగన్!   1

చప్పని జీవితంబునఁ బసందగు కావ్యకళా వినోదమే
గొప్ప దటన్న భావమునకుం దలయొగ్గి, నిరంతరమ్ముగా
నిప్పగిదిన్ రసజ్ఞుల ననేకుఁ జేర్చి, ముదంబు రాశిలోఁ
దేల్పఁ దేల్చుచున్న "సమితిన్" సుమతుల్ వినుతింపకుందురే!   2

ఒక సహృన్మణి సిరాళకుఁ దావులేకుండ
వేడుకమై నిల్వనీడ నీయ!
ఒక రసజ్ఞుండు కార్యోత్సాహ వివశుఁడై
నెమ్మిమై నిశల దీపమ్ము నీయ!

---

1. నేను బాపట్లలో నుపాధ్యాయుఁడుగా నున్న కాలమున నచ్చటి D. E. O. ఆఫీసులో నుద్యోగి యగు శ్రీ తూములూరి అప్పయ్యశాస్త్రి కవియు, రసజ్ఞుఁడు నగుటచే సాహిత్యాభిరుచిగల నాబోంట్ల నెందరినో ప్రోత్సహించి, 'బాపట్ల సారస్వత సమితి' యను పేర నొక సంస్థను నెలకొల్పి, యే సౌకర్యములు లేకపోయినను "Where there is a will, there is a way" అన్న సూక్తి ననుసరించి పట్టుదలతో నొక సంవత్సరముపైఁబడి కొనసాగించితిమి. అనేక సాహిత్య, సంగీత కార్యక్రమములు తరచుగా జరుగుచుండెడివి. ఆ సంస్థ ప్రథమ వార్షికోత్సవమును పురస్కరించుకొని నాచే రచింపఁబడి, చదువఁబడిన పద్యము లివి. అది హేవళంబి వసంతము.

ఒక మిత్రరత్న మూరక ముచ్చటలు సేయు
తలిని వేవేగ నా స్తరణ మీయ!
ఒక కళానిధి సముత్సుకతఁ జేయూత నీఁ
గోరి మంగళవాద్యగోష్ఠి నీయ
ఇతర గతుల మహోదారు లెందఱేని
సాయ మొనరింప ముద్దు ముచ్చటలు జూపి,
కలిమి వెనుకాడినను, నంగబలము తోడ
సాగిపోయినది చిన్ని 'సమితి' జాల! ! 3

అవిరళ కార్యదీక్ష నుతు లందెడు "గ ర్తపురా"ంధ్ర సంసదు
ద్భవ నొక సాహితీలతిక 'భావపురమ్మ'నఁ బొదుకొల్పి, వేఁ
జివురులు, మొగ్గలున్, విరులు శీఘ్రగతిన్ వెలయించి 'హేవళం
బ' విధివళమ్ము నంజనియెఁ బై ఫలసిద్ధి 'విలంబ' గూర్చుతన్. 4

వినిపించినది రసావేశ భవ్య కవిత్వ
కలికించి తాలాప విలసనమ్ము
కీర్తించినది కళామూర్తులౌ 'నన్నయ'
'కాళిదాసా'దుల ఘన యశమ్ము
కల్పించినది సర్వకలుషాపహర సా
గర పవిత్రజలావగాహనమ్ము
శ్రావించినది దివత్రయము భక్తులవెల్లఁ
'ద్యాగయ్య' దివ్యగాథామృతమ్ము
పేరుఁ గొన్నది నూటపదారు లిచ్చి
యొక్క పండిత కవికి నొడ్డోలగమునఁ
బడమిఁ బండ్రెండు మాసాల పురిటిబిడ్డ
ధన్యయైనది, జన్మసార్థకతఁ గాంచె ! 5

దెస లావరించి యింపెసలారు మల్లికా
ప్రసవ ప్రసిద్ధ సౌరభము లట్లు!
తీరు తీయముల నోరూరించు మధురసా
సారమ్ముతో 'జహాంగీరు' లట్లు!
ఉభయ సంధ్యలఁజిత్త ముప్పొత్తుగ హరించి
వెత డించు మలయమారుతము లట్లు!
యువక మానసముల నుఱ్ఱూత లూగించు
ప్రౌఢాంగనాపాంగ పంక్తు లట్లు!
నవ నవామోద, సరస, వినమ్ర, సౌఖ్య
గతులఁ బండిత రసికలోకమును దేల్చి
ముద్దు ముద్దుగ శైశవమ్మును దరించు
మా కుమారిని దీవింపుమా, వసంత!

—

# ఆరోగ్య భాస్కరమాల

శా॥ యావద్విశ్వము నాట్యరంగముగ మా యాతత్త్వసంభూతమౌ
జీవవ్రాతముఁ బాత్రధారులుగ సృష్టింజేసి దూరస్థుఁడై
తా వీక్షించుచు ఖేదమోదముల సందంబొక వెల్గొందు న
ద్దేవుం డిచ్చుత సర్వమానవులకున్ దీర్ఘాయురారోగ్యముల్.

ఉ॥ యోగ్యుఁడు సర్వసంపదల నొల్లక రోగవిహీనదేహమే
భాగ్యమటంచు నెంచి పలుబాములచే నది సంగ్రహించు, ని
ర్భాగ్యుఁడు దేహసౌఖ్యములఁ బాసి ధనంబు గడించు, కాని యా
రోగ్యముఁ గల్లువాఁడొకఁడె రూఢిగ జన్మఫలంబుఁ గాంచెడిన్.

మ॥ తన కారోగ్యము శూన్యమైన తన సంతానంబెటుల్ దుఃఖ భా
జననానావిధ ఘోరదుర్భరమహా జాడ్యప్రకీర్ణాంగులై
చను వారో మది నూహఁ జేసి నిజ వంశంబుద్ధరింపం దలం
చినచో మానవుఁ డాత్మదేహమును బూజింపండె దైవంబుఁగాన్!

సీ॥ దేహంబునకు దీప్తిఁ దెచ్చు రక్తమువృద్ధిఁ,
    జెంద వ్యాయామంబు సేయుటొకటి
సర్వకాలములందు సాధ్యమౌనంతకు,
    మంచివాయువునె శ్వాసించుటొకటి
తనకు హితంబైన దానిని మితముగా,
    నెల్ల వేళల భుజియించుటొకటి
నిర్మలోదక సమన్విత జలాశయములఁ,
    జెడిపోవకుండ రక్షించుటొకటి

గీ॥ నిద్ర, విశ్రాంతి, మొదలైన నిఖిలకార్య
సంచయమునందు మితముఁ బాటించుటొకటి
జనున కారోగ్య సంపద సంఘటించి
మహిత సౌఖ్యములంగూర్చు మాట నిజము.

మ॥ జలభూభాగములందుఁ గాలమును బుచ్చున్ జేతనాచేతనం
బులఁ బెక్కింటి సృజించినట్లె పవనాం బోరాశిలోఁగూడ న
తులకుం దోపక యే సతంబును జన క్షోభంబుఁ గావించు జీ
వుల సృష్టించె విరించి యంచుఁ దెలిసెం బో! నేఁడు లోకాళికిన్.

ఉ॥ ఆకృతియందుఁ జూడఁ బర మాణు సమానములయ్యు ఘోర ద
ర్వీకరకోటికన్నఁ బదివేలమడుంగు లనర్థదంబులై
లోకులనెల్లఁ గాఱడవిలోని దవానలమోయనంగ భ
స్మీకృతులం బొనర్చెడు సు మీ! చరియింపుఁడు జాగరూకులై.

ఉ॥ మానవదేహమందుఁ గొఱమాలిన యీ క్రిమిజాల మెట్టులో
స్థానము సంగ్రహించుకొని సర్వ దురామయముల్ ఘటింప న
జ్ఞానులు కర్మమూలములు జాడ్యములంచు వచించుచుందురే
గాని యదార్థముం దెలియఁ గా మదినెంచ రిదేమి చోద్యమో!

కం॥ ధారుణి జన్మించిన నరుఁ, డూరకఁ గూర్చుండ నెంచు టుచితమె? నిర్వ్యా
పారత్వ కారణంబున, నారోగ్యము సన్నగిల్లి యవినీతుఁడగున్.

శా॥ ఆపద్యోద్భవ కేశవప్రముఖు లా ద్యంతంబు వీక్షించి ని
ర్వ్యాపారత్వ మనర్థదంబనియె బ్రహ్మాండంబు సృష్టింపఁగాఁ
గాపాడన్ హరియింపఁగాఁగల మహాకార్యంబులం బూనఁగా
నోపున్ లేనియెడన్ మఱెందుకొఱకా యుద్యోగముల్ వారికిన్?

సీ॥ ప్రాపంచిక సుఖాను భవము ఘటించుట
కారోగ్యమే ముఖ్య మార్యులార!
భారతీ యోన్నత పదసమార్జనమున,
కారోగ్యమే ముఖ్య మార్యులార!

ఘన యశోదీప్త జీవనముఁ గల్పించుట,
కారోగ్యమేముఖ్య మార్యులార!
పరలోకసౌఖ్య సంపద్విలాసముఁగూర్ప,
నారోగ్యమే ముఖ్య మార్యులార!

గీ॥ పుట్టి పెరిగెడు దేహంబు గిట్టువరకు
జీవుఁడనితరసాధ్య మహోవిభూతి
నంది, మోదాంబు నిధినోల లాడవలయు
నన్న, నారోగ్యమే ముఖ్య మార్యులార!

సీ॥ సదసద్వివేక సంపదఁగూర్చి మాన్యత,
ఘటియించు సత్కళాపటిమయున్న
అలజయంత వసంత నలకూబరాదులఁ,
దలఁదన్ను భూరి సౌందర్యమున్న
నందనవనతుల్య సుందరోద్యాన సం,
వేష్టిత ప్రాసాద వితతియున్న
రంభాది నిర్జర రమణీమణులకన్న,
మోహనమూర్తులౌ ముదితలున్న.

గీ॥ వచ్చియును రాని నుడువుల వలన ముదముఁ
గడలుకొనఁ జేయఁగల చిన్ని బుడుతలున్న
కలదె కాసంతయైన సౌఖ్యంబు నరున
కొక్క యారోగ్యమే లేక యుండునెడల?

గీ॥ ధర్మ మలవడ విజ్ఞాన ధనమువలయు
దాని గడియింపఁ బ్రథమ సాధనము బుద్ధి
బుద్ధినిశితత్వమున కంగపోషణంబు
ముఖ్య, మద్దియు నారోగ్య మూలకంబుఁ
గా నెఱింగి ప్రవర్తింత్రు గాక జనులు!

# సంప్రార్థనము

క్రతువు లొనర్చి, స్వర్గసుఖకాంక్షలు దీర్చుకొనంగలేని నా
బ్రతుకు, భవత్తనూల్లసిత భవ్య సువర్ణ విభూషణాళితో
రుతులను మేళవించి, యవిరోధముగా నినదించు కచ్ఛపీ
శ్రుతి శ్రుతులందుఁ జేర్చుకొని, చొక్కి సుఖించెడుగాక, భారతీ!

ప్రవిమల బుద్ధివై భవ విభాసితులై, కృతిభూష లిచ్చు స
త్కవి నివహంబుఁ, బండిత నికాయము సిగ్గిల దైన్యబాధఁ గూ
ర్తువుగద! ప్రాతకాలఁపు విరోధములన్ దిగమ్రింగి, అత్తతో
సవినయరీతి నింకపయి సంధియొనర్పఁగరాదె, భారతీ:

కాసుల్ లేని నిరక్షరాస్యుని జగత్కల్యాణ సంధాన వి
ద్యాసామ్రాజ్య రమాధినాథునిగఁ జేయన్, మేటి విద్యాధికున్
పీసంబేని యనుగ్రహింపమియు, నుర్విన్ నీ విలాసమ్మ! త
ల్లీ! సారస్వత విశ్వరూప మహిమాలీలావతీ, భారతీ!

అకలంకాత్ములు, సత్కవిప్రవరు లూహాతీతమౌ శిల్ప ల
క్ష్మికిఁ బట్టైన యమూల్యభూషలు, విపశ్చిన్మానసాంభోజముల్
వికసింపన్ భవదీయదేహమున నర్పింపంగ, నాపాదమ
స్తకమున్ నిండినదేమొ: మత్కృతి విభూషం దాల్పఁ దా వున్నదే!!

జిలిబిలి మాటలన్ సుధలుచిందు కవిత్వఝరీప్రవాహము
జ్జ్వలముగ సాగుఁగాక, యది శాశ్వతమై జగతిన్ రహించునే?
పలుకులకల్కి! తావక కృపాపరిపూర్ణకటాక్ష వీక్షణం
బులు ప్రసరించు సత్కవులెపో!, సుకృతుల్, చిరజీవు లిద్ధరన్:

‘అయ్యలరాజు’ సత్కవికి, నట్టులె ‘పిల్లలమఱ్ఱి’ వానికిన్
నెయ్యము మీఱ ‘బమ్మెర’ మనీషికిఁ, దావక రూపదర్శనం
బొయ్యన సంఘటించితి! మహోజ్జ్వలరీతిఁదదీయజిహ్వాలం
దుయ్యల లూగుకైతల కహో యని మెచ్చు రసజ్ఞ లోకముల్।

సకలస్థావర జంగమ ప్రకృతిపై స్వామిత్వముం గోరి, సృ
ష్టికి వైవిధ్యముఁ గూర్చె నీ పతి సురజ్యేష్ఠుండు! నీ వేమి కో
రికతోఁ బండితు లందసూయయును, దారిద్ర్యమ్ముఁ గల్పించి తో
యకలంకాత్మ! కళామయప్రకృతి కర్హం బౌనె యీ పోడుముల్?

ప్రకటంబేగద యొక్కచంటను బయఃపానమ్ముఁ గావించు న
ర్భకుఁ డొండొక్కపయోధరమ్ము సవరింపం బూనుటల్! లోక రీ
తికి భిన్నమ్ముగ నీదుబిడ్డలకు వాగ్దేవీ! యిదే మమ్మ! యి
ట్లొకచన్నిచ్చి, మరొక్కటీయవు జగం బుఱ్ఱూత లూగింపఁగన్!।

సమచిత్తుల్ ఋషులౌట నిస్తులకళా సామ్రాజ్య పట్టాభిషే
కముఁ గావించిరి పోవెలంత కిటు: లీ కాలాను గుణ్యంబుగం
దమ వారిం బయిలెత్తుకో గలుగు ‘సత్తా’ నీకు శూన్యంబె? బు
ద్ధిమహత్త్వంబునఁ బూర పాళికి స్వజాతింగ్రిందుఁ గావింతువే!

నీదౌ శక్తి యపార, మద్భుతము, దుర్జ్ఞేయమ్ము; త్వచ్చిత్కళా
యాదో రాశి వినిర్గళాంబుకణ తుల్యంబుల్ చతుష్షష్ఠి వి
ద్యాదుల్ మేదినిఁ; దావకీన కరుణార్ద్రాపాంగ లేశమ్ముచే
మేదస్సుల్ చిగురించు పండితులె సుమ్మీ రక్షకుల్, భక్షకుల్।

# నేటి లోకం

## (గేయము)

1. కలి మహాత్వమొ యేమొ ధర్మముఁగాలఁదన్నెడి నేటి లోకం
చిలిపి చేష్టల దుష్టబుద్ధుల చెనటులకె కనకాభిషేకం!

2 కావ్యనిర్మాణాధికారికి కాని నీయదు నేటి లోకం
గాలిపాటలఁదేలు తేలిక కవులకే కనకాభిషేకం!

3. గరితమిన్నల సుగుణసంపద గౌరవింపదు నేటిలోకం
తఱపి వెన్నెల మిలమిలల్గను తారలకె కనకాభిషేకం!

4. మేటి యాయుర్వేద శక్తిని మెచ్చుకొనదీ నేటి లోకం
బూటకపు డాక్టరుల సూదుల పోటులకె కనకాభిషేకం!

5. నిక్కువము వచియించు పెద్దల లెక్కసేయదు నేటిలోకం
పెక్కురీతులఁ తలలు మార్చెడి టక్కరికె కనకాభిషేకం!

6. శీలవంతుల దివ్యగాథలు చెవినిఁ జేర్చదు నేటిలోకం
వేలు, లక్షలు రూకలుండిన వెఱ్ఱులకె కనకాభిషేకం!

7. వాసి గల్గిన పండితోపన్యాస మొల్లదు నేటిలోకం
'గ్యాసు' గొట్టుచు గంతులిడు రాకాసులకె కనకాభిషేకం!

8. అతివలిడు మృష్టాన్న భోజన మాసపడదీ నేటిలోకం
: తితులిడు హోటళ్ళ యెంగిలి మెతుకులకె కనకాభిషేకం!

9. గుండెలోపలి దేశభక్తిని కొలిచి చూడదు నేటి లోకం
గండుమీరిన బాహ్యవేషపు గడబిడకె కనకాభిషేకం!

10.జాతియైక్యత కొఱకు కోరలు సాచుచుండును నేటిలోకం
నీతిమాలిన కులములకె మరి నిత్యమును గనకాభిషేకం!

11.కడుపు మండిన పేదవానికి గంజి బోయదు నేటిలోకం
గుడుల లోపలి ఱాతి బొమ్మల యడుగులకుఁగనకాభిషేకం!

— —

# గ్రంథకర్త వివరములు

జననము : 15th October, 1907

జన్మస్థలము : పెద్దచెరకూరు, బాపట్ల తాలూకా,
గుంటూరు జిల్లా.

నివాసము : అప్పికట్ల, గుంటూరుజిల్లా

విద్యాభ్యాసము: ప్రాథమిక విద్య జనకునియొద్ద,
ఉన్నతవిద్య బోర్డు హైస్కూలు, బాపట్ల

ఉద్యోగము : Headmaster

1. V V. Higher Ele. Sehool, Munipalle.
2. A. V. V. Higher Ele. School, Bapatla.

ఇతర రచనలు : గురుగౌరవము
వీరభారత శతకము (Morals on CitizenshiP)

చిరునామా : H No. 8-3-966/19, నాగార్జున నగర్,
ఎలారెడ్డిగూడా, హైదరాబాదు-500 873